1.4.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి: 65, సంచిక: 13. విడిప్రతి: రు. 2.00 లు

# జమీన్‌రైతు



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి,

# మూలవిరాట్ మనసులో ఏముంది?

అసెంబ్లీలో ప్రతిపక్షాలు ప్రతిపాదించిన అవిశ్వాస తీర్మానం నుంచైతే కోట్లవారు బయట పడగలిగారు కానీ సొంత పార్టీలో 'విశ్వాసం' సంపాదించడమే ఆయనకు కష్టంగా వుంది. అసెంబ్లీలో మూడింట రెండొంతులు మెజార్టీ వున్న కాంగ్రెస్ పార్టీకి ప్రతిపక్షాల అవిశ్వాసం తిప్పికొట్టడం అసలు సమస్యే కాదు. కానీ సొంత పార్టీలో రోజు రోజుకు ముఖ్యమంత్రిపై పెరుగుతున్న అవిశ్వాసాన్ని మాటేమిటి? అధికారం ఆయన గుప్పెట్లో వుంది కాబట్టి బహిరంగంగా అసంతృప్తిని వెళ్ల గక్కడానికి చాలామంది ఎమ్మెల్యేలు భయపడ్తున్నారు. మరికొంతమందైతే పార్టీకి నష్టం జరుగుతుందని వేచి చూస్తున్నారు. ఒక వేళ పార్టీలోని ఎవరైనా అవిశ్వాస తీర్మానం పెట్టగలిగితే ముఖ్యమంత్రి నెగ్గుక రావడం కష్టమే కావచ్చు. అది ఊహాజనితమే అయినప్పటికీ కోట్ల వారి పరిస్థితి అలాగే వుంది. ఏడాదిన్నర క్రితం అధికార పీఠాన్ని అధిష్ఠించినప్పుడు కోట్ల వారి కోట ఎంత పటిష్ఠంగా, శత్రు దుర్భేద్యంగా వుందో ఈ రోజు అంతగా బీటలు వారి కూలి పోవడానికి సిద్ధంగా వుంది. అధిష్ఠానం దేవుడు అనుగ్రహిస్తే అసంతృప్తి బద్దలైతే ఆ కోట క్షణంలో కూలడం ఖాయం. అయితే అది జరుగుతుందా? సాధారణ ఎన్నికలు మరో ఎనిమిది నెలల్లో జరగనుండగా నాలుగో కృష్ణుడ్ని తెర మీదకు తేవడానికి అధిష్ఠానం సిద్ధంగా వుందా? ప్రస్తుతం కాంగ్రెస్ ఎమ్మెల్యేల మెదళ్లను తొలుస్తున్న ప్రశ్న ఇది. గతంలో అయిదేళ్ళలో నలుగురు ముఖ్యమంత్రుల్ని మార్చి కాంగ్రెస్ భంగపడిన చేదు అనుభవాల్ని అధిష్ఠానం మరచి పోగలదా? కానీ కోట్ల వారినే ముఖ్యమంత్రిగా కొనసాగిస్తే పరిస్థితి అంతకంటే దారుణంగా వుండగలదని అధిష్ఠానం ఇప్పటికే ఒక నిర్ణయానికి వచ్చిందట. నుయ్యిలో పడి ప్రాణాలు తీసుకునే కంటే గొయ్యిలో పడి దెబ్బలతో బయట పడటం మంచిదని అధిష్ఠానం భావిస్తోందట. ఢిల్లీకి వెళ్లి ప్రధానితో ఇక్కడి విషయాలు ఎప్పటికప్పుడు చేరవేస్తున్న కోట్ల వ్యతిరేక వర్గాలు ప్రస్తుతం పై అభిప్రాయాన్ని ప్రచారం చేస్తున్నాయి. కోట్ల వారు ఒకే కులానికి ప్రతినిధిగా వ్యవహరిస్తున్న విషయం పి.వి. బుర్రలో పెట్టడంలో కోట్ల వ్యతిరేకులు విజయం సాధించారు. ఇటీవల కోట్ల వారి తరపున రాయబారానికి వెళ్లిన మంత్రుల బృందంతో కూడా పి.వి. ఈ విషయమై అసంతృప్తి వెళ్లగక్కారట. రాష్ట్రంలో కోట్లతో వున్న వారెవరో నాలుగు పేర్లు చెప్పండి చూద్దాం అని పి.వి. నిలదీస్తే మంత్రులు బిక్కమొహం వేయాల్సి వచ్చిందని అంటున్నారు. జనార్ధన రెడ్డి, శివశంకర్, జలగం వెంగళ రావు, ముద్రగడ పద్మనాభం, వై.ఎస్. రాజశేఖర రెడ్డి, కె.ఇ.కృష్ణమూర్తి, వెంకట స్వామి ప్రభృతులు, పలువురు ఎంపిలు ముఖ్యమంత్రిని తీవ్రంగా

కొరవ 11 పేజీలో

**కోట్లవారి కోట బీటలు వారిపోతూంది;**
**అధిష్టానం దాన్ని బ్రద్ధలు చేస్తుందా?**



ISSUE OPENS ON 4TH APRIL 1994

# 100% EOU

RS. 5 ON APPLICATION

**Public issue of 1,00,00,000 equity shares of Rs. 10 each for cash at par aggregating Rs. 1000 lakhs.**



## ISSUE HIGHLIGHTS

1. Existing profit making company-declared 15% dividend for the year 1992-93 (Profit Rs. 51.56 lakhs and equity of Rs. 283.00 lakhs).
2. 100% Export Oriented fully Integrated Aquaculture Project consisting of Hatchery, Farm, Feed Mill and Processing Plant.
3. Shrimp farm already under operation and bagged Best performance Award for 1991-92.
4. The first Indo-Taiwanese Joint venture in aquaculture with a comprehensive collaboration covering Technical knowhow, Investment of 17.5% in equity by Nan Rong Group of Taiwan.
5. Performance guarantee by Nan Rong Group of Taiwan.
6. 100% buy back arrangement for entire production with Nan Rong Group of Taiwan.
7. Capacity to develop satellite shrimp farm by providing technical knowhow, feed stock inputs and processing.
8. Promoted by Mr. S. Prasad Reddy with a decade of experience in marine industry.
9. Project appraised by IFCI and participation by IFCI/IDBI/ICICI/IRBI in term Loan of Rs. 25.80 crores.
10. Equity participation by MPEDA.
11. Low Break even point.
12. Exports Profit totally exempt from Income Tax under section 10B and 80HHC of Income Tax Act 1961.
13. Section 80 L and 80 M benefits of Income Tax Act and Wealth Tax benefits.
14. Easy liquidity listing at Hyderabad and Bombay Stock Exchanges.

**INVESTORS MAY NOTE THAT IN CASE OF OVERSUBSCRIPTION, THE ALLOTMENT SHALL BE ON A PROPORTIONATE BASIS AND A SEBI NOMINATED PUBLIC REPRESENTATIVE SHALL BE ASSOCIATED IN THE PROCESS OF FINALISATION OF BASIS OF ALLOTMENT.**

## RISK FACTORS

### EXTERNAL

The company's activities are related to Farm and Hatchery operations and are subject to natural calamities. This may result in low productivity and longer harvest periods which could adversely affect the performance of the company.

The international prices of shrimps are subject to fluctuations depending on demand/supply.

Shrimps, being live stock are exposed to the risk of disease.

Any adverse fluctuation in the exchange rate of rupee may adversely effect the profitability projections.

### INTERNAL

Total required power connection is yet to be obtained.

The company is yet to obtain sanctions for enhanced working capital limits.

The company is yet to obtain permission from pollution control board.

Any delay in implementation of the project may effect the financial projections.

## MANAGEMENT PERCEPTIONS OF RISK FACTORS

### EXTERNAL

The site location has been designed to take care of this and till date the company's crops have not been affected by natural calamities.

The company has already exported its products to Japan and the company proposes to maximise realisations by offering the products that could fetch the best prices to the market.

In view of scientific pond management and disease control methods being employed, the company does not envisage any problem with regard to disease.

### INTERNAL

The company has already filed its application for total power requirement with APSEB. The company does not foresee any difficulty in obtaining the power sanction. The company already has 75 kva power connection and 690 kva generator stand by for existing operations.

The company already submitted application to Bank of Baroda for the enhancement of limits. The company does not foresee any difficulty in obtaining sanction on enhanced working capital.

The company has already submitted application to the Pollution Control Board. The company doesn't foresee any difficulty in obtaining the permissions from the pollution control board.



# SHARAT SEAFOODS LIMITED

REGISTERED OFFICE : 207, Lingapur Building Amrutha Estate, Himayat Nagar, Hyderabad - 500 029.

LEAD MANAGERS



**INDUSTRIAL FINANCE CORPORATION OF INDIA LIMITED**
No. 16, Sansad Marg
Bank of Baroda Building
New Delhi-110 001.



**BANK OF BARODA**
Merchant Banking Dept
90,
C.P. Ramaswamy Road
Alwarpet
Madras - 18

REGISTRARS



**AARTHI CONSULTANTS PVT LTD**
1-2-285, Domalguda
Hyderabad - 500 029.

ADVISORS



**ITC CLASSIC FINANCE LTD**
31, Sarojini Devi Road,
Secunderabad - 500 003.

CO-MANAGERS



**INDBANK MERCHANT BANKING DIVISION**
3-6-237, Lingapur House
Himayat Nagar Hyderabad - 500 029.



**PRUDENTIAL CAPITAL MARKETS LTD**
6-3-1110, 26 & 27
Amruthamal
Somajiguda, Hyderabad - 500 016.

# ఇంకా కుంటి సాకులేనా

పంచాయతీ, మునిసిపాలిటీల చట్టాన్ని సవరిస్తూ ప్రతిపాదించిన బిల్లులు శాసనసభ ఆమోదం పొందాయి. కేవలం రాజకీయ ప్రయోజనాల లక్ష్యంతో విజయ భాస్కరరెడ్డి ప్రభుత్వం మొదట ప్రవేశపెట్టిన బిల్లులోని లోపాలను కొన్నింటినైనా సెలక్ట్ కమిటీ సిఫార్సుల రూపంలో సరిదిద్ది నందుకు సంతోషించాలి.

కొత్త చట్టం ప్రకారం పంచాయితీలు, మునిసిపాలిటీలకు ఐదేళ్లకొకసారి ఖచ్చితంగా ఎన్నికలు జరిపి తీరాలి. గ్రామ స్థాయిలో సర్పంచ్ ఎన్నిక ప్రత్యక్ష పద్ధతిలో జరుగుతుంది. మండల పరిషత్, జిల్లా పరిషత్‌లకు మాత్రం పరోక్ష పద్ధతిలో జరుగుతాయి. ఈ రెండు సంస్థల ఛైర్మన్లను ప్రాదేశిక నియోజక వర్గాల ప్రతినిధులు ఎన్నుకొంటారు. సర్పంచ్‌లకు మండలంలో, మండలాధ్యక్షులకు జిల్లా పరిషత్‌లో సభ్యత్వం వుంటుంది కాని ఓటు హక్కు వుండదు. మండల, జిల్లా పరిషత్ ప్రాదేశిక నియోజక వర్గ ప్రతినిధులకు ఓటు హక్కు వుంటుంది కాని, ప్రజలతో, ప్రజా ప్రయోజనకర కార్యక్రమాలతో, నిధులతో సంబంధం వుండదు. ఏ లక్ష్యాన్ని ఉద్దేశించి, ఏ ప్రయోజనం ఆశించి ప్రాదేశిక నియోజక వర్గ ప్రతినిధుల పద్ధతిని ప్రవేశ పెట్టారో గాని, దానివల్ల పంచాయితీల వ్యవస్థ గందరగోళంలో పడిపోతున్నది. ఎవరు తమకు నిజమైన ప్రతినిధులో, తమ సమస్యలు ఎవరికి నివేదించాలో అర్థం కాక ప్రజలు అయోమయంలో పడిపోతారు. అధికారులపై అజమాయిషీ, అభివృద్ధి కార్యక్రమాల పర్యవేక్షణ ఎవరి బాధ్యతలో కూడా అర్థం కావడం లేదు.

పార్టీ రహితంగా ఎన్నికలు నిర్వహించాలన్నది మరొక ప్రధాన సవరణ. పార్టీల గుర్తులు, జెండాలు, టికెట్లు వుండకపోవడం తప్ప, పార్టీ యంత్రాంగాలన్నీ వెనుక నుంచి ఎన్నికల తంతును కైవసం చేసుకోవడం తప్పదు. అయితే పంచాయితీల పై నేరుగా రాజకీయ పార్టీల రంగు పులమక పోవడం గ్రుడ్డిలో మెల్లగా భావించాలి. గ్రామ పంచాయితీలలో ఇద్దరు సభ్యులను ప్రభుత్వం నామినేట్ చేసే పద్ధతికి స్వస్తి చెప్పి విజ్ఞత ప్రదర్శించారు. ఎన్నికైన వార్డు మెంబర్ల సంఖ్యను తారుమారు చేసి దొడ్డిదారిలో అధికారాన్ని గుంజుకోవడానికి పాలక పక్షం కుట్రపన్నుతున్నదన్న నిందను తొలగించడం సంతోషదాయకం.

పరోక్ష పద్ధతిలో ఎన్నికల వల్ల ఎన్నికల సమయంలో ఓట్ల కొనుగోళ్లు, కిడ్నాప్‌లు, క్యాంప్‌ల నిర్వహణ, ప్రలోభాల వంటి సకల సబ్బండు అవినీతి దుర్లక్షణాలూ తెరపైకి 'రావడంతో పాటు, మండల, జిల్లా పరిషత్ ఛైర్మన్ పదవులకు స్థిరత్వం లోపిస్తుంది. అవిశ్వాస తీర్మానం బెడదతో, అధ్యక్షులు అనుక్షణం పదవీ గండ భయంతో పరిపాలన చేయవలసి వస్తుంది.

రిజర్వేషన్‌ల సంఖ్యను విపరీతంగా పెంచి పారేశారు. బిసిలకు 33 శాతం, హరిజనులకు 18 శాతం, గిరిజనులకు 8 శాతం - వెరసి 59 శాతం పదవులు రిజర్వు అవుతాయి. మొత్తం పదవులలో మళ్లీ 3 వంతు మహిళలకు అన్నారు కాబట్టి, నికరంగా ఇతర కులాల నాయకులకు లభించే పదవుల శాతం కేవలం - 27.40 మాత్రమే. దీనివల్ల పంచాయితీల పట్ల గ్రామ స్థాయి నాయకులలో నిర్లిప్తత ఏర్పడే ప్రమాదం వుంది.

ప్రతి ఐదేళ్ల కొక సారి స్థానిక సంఘాలకు విధిగా ఎన్నికలు జరుగుతాయన్న శుభవార్త తప్ప కొత్త పంచాయితీలు, మునిసిపాలిటీల చట్టంలో సంతోషించ దగిన అంశాలేవీ లేవు. బిల్లు చట్టంగా మారిన తర్వాత కూడా, రాష్ట్ర ప్రభుత్వం వీటి ఎన్నికల వాయిదాకు కుంటి సాకులు వెతుకుతూనే వుంది. ఓటర్ల జాబితా సవరణకు తగిన వ్యవధి లేదు




కాబట్టి ఇప్పట్లో, ఎన్నికలు జరపమని ప్రకటించారు. జాబితా సవరణ జరిగేటప్పటికి అసెంబ్లీ ఎన్నికలు దగ్గర పడతాయి. అందువల్ల మళ్లీ వాయిదాయే. కనీసం తొమ్మిది నెలల కివతల పంచాయితీల ఎన్నికలు జరిగే అవకాశం కన్పించడం లేదు. స్థానిక సంస్థలకు రాజ్యాంగ రక్షణ కల్పించాలనే రాజీవ్‌గాంధీ మహత్తర ఆశయాన్ని ప్రధాని శ్రీ పివి నెరవేర్చినా, వాటికి పట్టిన గ్రహణం తొలగక పోవడం శోచనీయం.

ఎన్నికల విషయంలోనే కాదు, పంచాయితీల అధికారాల విషయంలోనూ నూతన చట్టంలో స్పష్టమైన నిర్వచనం ఇవ్వలేదు. జిల్లా స్థాయిలో డిడిఒ, మండల స్థాయిలో ఎండిఒ లపై జిల్లా పరిషత్, మండల పరిషత్‌లకు పూర్తిస్థాయి పర్యవేక్షణ అధికారం లేదు. వారి నియామకాలు, బదలీలు ప్రభుత్వం చేతిలోనే వున్నాయి. ఇళ్ల నిర్మాణం, రోజ్‌గార్, ఉపాధి హామి పథకం వంటి కార్యక్రమాలన్నీ కలెక్టర్ల పరిధిలోనే వుంటాయి. అభివృద్ధి కార్యక్రమాలకు కేంద్రం ఇచ్చే ఇటువంటి ప్రత్యేక నిధులు తప్ప పంచాయితీలకు స్వయం జనిత వనరులు లేవు. అభివృద్ధి చేసుకోవడానికి అవకాశమూ ఇవ్వలేదు. నిధులన్నీ అధికారుల చేతిలో పెట్టి, పదవి మాత్రం అనధికారుల కివ్వడం వల్ల ప్రజలకు కల్గే ప్రయోజనం ఏమీ లేదు. గ్రామ స్థాయిలో జరిగే ప్రతి అభివృద్ధి కార్యక్రమం పైన నిర్ణయం తీసుకునే స్వేచ్ఛ, పర్యవేక్షణ హక్కు ఎన్నికైన ప్రజాప్రతినిధులకు ఇస్తేనే పంచాయితీల వ్యవస్థ సక్రమంగా పనిచేస్తుంది.

# దళితులలో ఎంత మందికి చిత్తశుద్ధి వుంది?

బ్రిటీషు వారి కుతంత్రాలకు విరుద్ధంగా జాతిపిత మహాత్మాగాంధీ సదుద్దేశంతో చేసిన పనుల గూర్చి శ్రీ బెజవాడ గోపాల రెడ్డి చెప్పిన మాటలను సణుగుడులో ఈతరం వారికి తెలియజేయడం సంతోషకరమైన విషయం. బహుజన సమాజ్ పార్టీ నాయకురాలు మాయావతి గాంధీగారు హరిజనులకు ఎటువంటి మేలు చేయక పోగా వర్ణ వ్యవస్థ నిర్మూలనకు అడ్డు తగిలాడంటూ, అంబేద్కర్‌ను సమంగా చూడలేదని విమర్శలు గుప్పిస్తున్నారు. ఆ రోజుల్లో దళితులకు ఆయన చేసిన కృషిని విస్మరించడం యేరు దాటి తెప్ప తగలేసిన చందంగా వుంది. బి.యస్.పి నాయకురాలు జాతిపిత పై ఈ విధమైన నిందా పూర్వక ప్రచారం చేస్తుంటే అటు ఢిల్లీ పెద్దలు గాని, ఇటు ఉత్తరప్రదేశ్ ప్రభుత్వంలోని వారు గాని నోరు విప్పక పోవడం జాతిపిత పై వారికున్న గౌరవాన్ని సూచిస్తుంది. ఇకపోతే దళితులమని చెప్పుకునే వారెంత మంది చిత్తశుద్ధితో తమలోని అసమానతను, అంటరానితనాన్ని రూపుమాపేందుకు ముందుకు వస్తున్నారు? తమ అంతస్తు పెరగడం తోనే అట్టడుగున వున్న తమ వారితో అన్ని సంబంధాలు తెంచుకోవడం, కించపరచడం ఎన్నోదగ్గర్ల చూస్తున్నాం. అగ్రవర్ణాల వారితో వివాహ సంబంధాలు పెట్టుకోవడమే సంఘ సంస్కరణ అవుతుందా? అంబేద్కర్ గారు చివరి వరకు తన మతం మార్చుకోకుండా, అగ్రవర్ణ కుటుంబీకురాలిని వివాహ మాడకుండా దళితులలోనే ఒకడిగా వుండి వుంటే ఆయన అందరికీ ఆరాధ్య దైవమయ్యే వాడేమో!

కొచ్చిన్ -ఎస్. రామచంద్రా రెడ్డి

## జనవాణి

### రాయలసీమా- రక్తదాహార్తి సీమా?

ఒకప్పుడు రాయ లేలిన రతనాల సీమ ఇప్పుడు రక్త దాహార్తి సీమగా మారిపోయింది. నిరంతరం హత్యలు, దొమ్మీలు, గృహదహనాల వార్తలు వింటూంటే హృదయం ద్రవించి పోతోంది. పేరు ప్రతిష్ఠలు, రాజకీయ స్పర్థల కోసం మానవత్వాన్నే మంటగలుపుతున్నారు అక్కడి నేతలు. అంగరక్షకులు, కత్తులు, చాకులు, తుపాకులు లేకుండా ప్రజల్లోకి వచ్చి మాట్లాడే ఒక్క నాయకుడైనా అక్కడ వున్నారా? రాయలసీమ ప్రభుత్వ ఏలుబడిలో వున్నా రాక్షసత్వానిదే పై చేయి అవుతున్నది. ఈ క్షుద్ర సంస్కృతిని ధ్వంసం చేసే వారే లేరా?

కోవూరు -ఎస్. హనుమంతరావు

### సెన్సార్ బోర్డు వింత ధోరణులు

ఇటీవల యువదర్శకుడు రామ్‌గోపాల్ వర్మ సెన్సార్ బోర్డు పై పలు విమర్శలు ఎక్కుపెట్టి సంచలనం సృష్టించారు. బోర్డు ధోరణి మారే వరకు చిత్రాలు తీయనని అలకపూనారు. ఈ నేపథ్యంలో పలువురు సినిమా ప్రముఖులు, పెద్దలు ఈ దర్శకుడిని సమర్థిస్తూ మాట్లాడారు. కాని ఇప్పుడొస్తున్న సినిమాలు చూస్తుంటే నిర్మాత, దర్శకులతో పాటు సెన్సార్ అధికారుల తీరును కూడా విమర్శించాలి. వర్మ చిత్రాలనే తీసుకుందాం. శివ చిత్రంలో విపరీతమైన హింస, రాత్రిలో దయ్యాల పై అభూత కల్పన, అంతం, గాయం చిత్రాలలో మళ్లీ హింస చూపారు. క్షణక్షణం, దొంగ దొంగ చిత్రాల్లో

కొరవ 10 పేజీలో

## 50 ఏళ్ళ క్రితం ఈవారం

31. 3. 1944

పేజీలు 8, వెల 0-1-6

### పల్లెటూళ్లు

#### పల్లెల్లో రూపాయినోటు

నలిగివుంటె చెల్లని సామాన్యంగా అంటున్నారు. లెక్కలేని చేతులు మారేటప్పుడు. మరీ కట్టెలు మోసేవాని బొడ్లో- పేతేసే ఆమె పైట కొంగున, వంకాయలమ్మే ఆయన పక్కాకు మూటలో- ఓయబ్బో! ఒక దినం పడుతుంది ఓపిక పట్టివింటె నా బ్రతుకు, ఎన్నిచేతులో మారుతాను దినానికి. ఇలాంటప్పుడు నేను మాసిపోయాను. నలిగిపోయాను, మరకలయ్యాను. ముద్దరలు పడ్డాను- కావున నే చెప్పేదేంటంటే !నన్ను మార్చు కునేందుకు లంచ మియ్యొద్దు. నేనెట్లా మారిపోతాను. ఒకరి దగ్గరనిల్చేదాన్నిగాదు, నాకూ మారనంటె - నేనేమిజేసేది? ఎవరితో చెప్పుకునేది? ఒక్కొరు నన్ను మార్చుకోవాలంటె ఆ నెపం యీ నెపంజెప్పి అణా. అర్ధణాగూడ గుంజేస్తున్నారు. నిలకడాలేదు. అందరూ నన్ను మంచి మనసుతో అనుభవించండి.

-రూపాయినోటు.

జేశారంటె - ఇంట్లో దీపమార్పేసినారన్న మాట.

-పౌరుడు.

ఈన చదువు మాకులేకుంటె మానె- యీ పీడను యింకెక్కడికన్నా దొబ్బె వాలు జిల్లాబోర్డువారు.

#### కావలి సినిమా కాలధర్మం

కావలి సినిమా మిషను-ప్రొజెక్టరును ఉగాదినాడు అమ్మేసి-సినిమాను నిలిపివేశారు.

లాయర్లు, డాక్టర్లు, రెడ్లు, కళాపోషకులు, రావుసాహెబులు. వర్తకులు వగైరా తలా నూరు రూపాయల భాగ్యంతో కొనా మొదటికి లాభంమీద నడిపించే ఘరానా పురుషులుండి గూడా సినిమా లేకుండా

#### గుండెమడకల బడయ్యోరు

బడయ్యవారు తత్వజ్ఞానోప దేశంతో ఘోరి వ్యవహారాల్లో జొరబడి పార్టీలుపెంచి గందరగోళం జేస్తున్నారు.

#### పెదారికట్ల పసుపుకుంకం

పెదారికట్లలో ఈ మధ్య 10 చీరలు 20 రవికెల పసుపుకుంకంతో లేచింది ఒక స్త్రీ- అబ్బా! -తట్ట.

జమీన్దారీ జవాన్లకు గుమాస్తాలకు సెప్టెంబరు నుండి జీత్రాలు యింకా యీలేదే- కరువులో గూడా యీ నిదానమేంది స్వామీ?

-ఒక భక్తుడు.

కొరవ 10 పేజీలో

# కాశ్మీర్ ముమ్మాటికీ మనదే- కాదంటే దేశ ద్రోహమే!

కాశ్మీర్ సమస్య-దేశ సమగ్రత అనే అంశం పై 26 తేది టౌన్ హాల్‌లో అన్ని పార్టీల నాయకులతో ఏర్పాటు చేసిన సెమినార్ ఏకాభి ప్రాయాన్ని ప్రతిబింబించలేక పోయింది. వివిధ పార్టీనాయకులు పార్టీ అగ్రనాయకులు వల్లిస్తున్న మాటలనే మళ్లీ చెప్పారు. అయితే సభలో పాల్గొన్న వారంతా కాశ్మీర్ మనదేనని మాత్రం నొక్కిచెప్పి బ్రతికించారు. న్యాయవాది ఆర్. సత్యనారాయణ, విజయా గ్రాఫిక్స్ ప్రసాద్ ఈ కార్యక్రమం ఏర్పాటు చేసారు. నెల్లూరు ఎమ్మెల్యే జె.కె. రెడ్డి అధ్యక్షత వహించి మాట్లాడారు. కాశ్మీర్ ఎవరిదో కాదు, దేశ ప్రజలందరిది; దాన్ని కాపాడు కోవల్సిన బాధ్యత ప్రతి ఒక్కరి పైనా వుందన్నారు. అమెరికా భారత దేశాన్ని తన గుప్పెట్లో పెట్టుకొనేందుకు పాకిస్తాన్‌ను మన పై వుసిగొల్పుతూంది; సిమ్లా ఒప్పందాన్ని తిరగతోడి పాకిస్తాన్‌కు అనుకూలంగా వ్యవహరిస్తోందన్నారాయన. కాశ్మీర్ విషయంలో ఎలాంటి అపోహలు, అనర్థాలకు చోటివ్వకుండా దేశ సమగ్రత, సమైక్యతను రక్షిస్తామని ప్రతిఒక్కరూ ప్రతిన బూనాలని జె.కె. కోరారు.

పాలకుల బలహీనతే కాశ్మీర్ సమస్యకు కారణమని తెలుగుదేశం నాయకుడు సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి అభిప్రాయ పడ్డారు. కొన్ని వందల మంది మిలిటెంట్లు వేలాది మంది ప్రజల ప్రాణాలు బలిగొంటూంటే నివారించలేక పోవడం దారుణ మన్నారాయన. భారతీయ జనతా పార్టీ అధ్యక్షుడు డాక్టర్ వరదయ్య మాట్లాడుతూ ప్రస్తుతం కాశ్మీర్ భారతదేశం చేతుల్లో లేదని మిలిటెంట్ల చెప్పు చేతుల్లో వుందని, గతంలో పాలకులు చేసిన తప్పుల వల్లే ఈ పరిస్థితి ఉత్పన్నమైందన్నారు. శ్రీనగర్‌లో జాతీయ పతాకాన్ని ఎగురవేసే పరిస్థితులు లేవని, ఒకవేళ ఎవరైనా ముందుకు వస్తే మన పాలకులువారిని అరెస్ట్ చేయిస్తున్నారని దుయ్యబట్టారు. కాశ్మీర్‌ను కబళించాలన్న యోచన పాకిస్తాన్‌ది కాదని దీని వెనుక అమెరికా కుటిల హస్తముందని యుసిపిఐ రాష్ట్ర కార్యదర్శి జి.ఎల్. నారాయణ రావు చెప్పారు. కాశ్మీర్ సమస్యను గోరంతను కొండంతలు చేసి మన దేశాన్ని అస్థిరత్వం పాలు చేయడానికి అమెరికా కుట్ర పన్నుతుందని ఆరోపించారు. సిపిఐ జిల్లా సమితి అధ్యక్షుడు పి. వేదాచలం, ఎన్. సిరాజ్‌ఖాన్, మాజీ కౌన్సిలర్ సేతురామిరెడ్డి తదితరులుప్రసంగించారు. కాశ్మీర్ వంటి సంక్లిష్ట జాతీయ సమస్యపై కూలంకషంగా చర్చ జరిపించి సామాన్యులకు కూడా సమస్య తీవ్రత అర్థమయ్యేట్లు చేసిన నిర్వాహకులు అభినందనీయులు.

## నెల్లూరు సంగతులు

### వయసు మళ్లిన పోలీసు ప్రతిభ!

డ్యూటీతో పాటు ఆటల్లోనూ ప్రతిభ చూపించాల్సిన కుర్ర పోలీసులు చతికిల బడిపోయినా, వయసు మళ్లిన పోలీసులు మాత్రం ఆటల్లో మంచి ప్రతిభ చూపి నెల్లూరు పేరు నిలబెట్టారు. 18, 19 తేదీల్లో విశాఖ పట్నంలో జరిగిన స్టేట్‌లెవల్ అథ్లెటిక్ మీట్‌లో 18 మందిపోలీసులు పాల్గొని 55 పతకాలతో తిరిగి వచ్చారు. వీరికి ఎఆర్ డి.ఎస్.పి. గోవింద రాజులు టీమ్ మేనేజర్‌గా

కొరవ 11 పేజీలో

## సణుగుడు

### * మా మంచి బాలుడు సివి!

### * కులం పిచ్చి మరీ ముదిరి పోతూంది!

### * న్యాయ వ్యవస్థకూ మురికి పట్టిందా?

రాముడు మంచి బాలుడన్నట్లు సివి శేషారెడ్డి కూడా మంచి శాసన సభ్యుడై పోయాడు. అయ్యవారిని తలుచుకుంటేనే జడుసుకొని, నిక్కరు తడుపుకొనే బడిపిల్లవాడి వలె ఈ నాలుగేళ్లలో ఒక్క నాగా పెట్టకుండా, అసెంబ్లీలో అటెండెన్సు వేసుకొని, ఫస్ట్ ప్రైజ్ కొట్టేశాడు. శాసనసభ హాజరులో తన జీవిత కాలమంతా క్రమం తప్పని వాడుగా గౌరవం పొందిన నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి లేని కొరతను శేషారెడ్డి తీర్చడం నెల్లూరుకు ఘనతే!

అసెంబ్లీ అటెండెన్సులోనే కాదు - నియోజక వర్గంలోని గ్రామాల సందర్శనలో కూడా శేషారెడ్డికే ప్రథమ బహుమతి ఇవ్వాలి. స్థాయి, అంతస్తు పెద్దవి కాబట్టి నేదురుమల్లి జనార్ధన రెడ్డి గారి రచ్చబండ సమావేశాలకు అంత ప్రచారం లభిస్తున్నది కాని, శేషారెడ్డి నిత్యం చేసేదదే! నెల్లూరులో వుంటే కనీసం రోజుకు రెండు గ్రామాలు చూడకుండా వుండలేడు; అధమ పక్షం వంద మందికి తక్కువ మాట్లాడకుండా నిద్రపోడు. ఆ ఓపిక, ఆ నేర్పరితనం అన్యులకు అసాధ్యం. హైదరాబాదులో వుంటేనన్నా సుఖంగా వుంటాడా? అబ్బే! అరశేరు బరానీలు అవలీలగా పట్టే గుడ్డ సంచి వంటి జేబు నిండా చీటీలు పెట్టుకొని రైలెక్కుతాడు. మంత్రులు, అధికారులు, అనధికారులు... ఒకరనేమిటి? ముఖపరిచయం వుంటే చాలు - తలుపు తోసుకొని వెళ్లి, ముఖ మాట పెట్టి, కాళ్లు గడ్డాలు పట్టుకొని బ్రతిమలాడి, నిష్ఠూర పడి కాగితాల పై సంతకాలు పెట్టించుకొని వచ్చేస్తాడు. పొద్దుటి నుంచి రాత్రి వరకు అదే యావ, అదే ధ్యాస. ఇప్పటి

#### డోలేంద్ర

ఎమ్మెల్యేలలో అంతగా చెమటోడ్చే వారు, జనంతో కలిసి పోయే వారు జనం కోసం సమయం వెచ్చించువారుచే ఎందరున్నారు చెప్పండి? 78 లో శేషారెడ్డికి, 89 శేషారెడ్డికి ఎంతో మార్పు. అనాటి ప్రవర్తనకు శిక్ష అనుభవించాడు; ఈనాటి పరిణతికి పారితోషికం పొందుతాడో లేదో వచ్చే నెలల్లో తేలిపోతుంది!

శేషారెడ్డి ఎంతటి మంచి శాసన సభ్యుడో, అంతే మంచి అసన

కొరవ 7 పేజీలో



# వారు విమానాల్లో ఆకాశంపైకి ఎగిరితే మనవారు పరాకాశంలో విహరిస్తారు!

16 తేదీ స్వర్గీయ తిక్కవరపు రామిరెడ్డి 103వ జయంతి సభను టౌన్‌హాల్‌లో సాహిత్య సదస్సు నిర్వహించింది. ఈ సభకో ప్రత్యేకత వుంది. శ్రీ రామిరెడ్డి జయంతి అవార్డును అలవాటు ప్రకారం సాహితీ వేత్తలకు కాకుండా, ఈసారి వాషింగ్టన్‌లో పేరున్న రసాయనిక శాస్త్రవేత్త డాక్టర్ కొట్రా వి.కృష్ణమూర్తికి ఇచ్చారు. "ఆలోచన, వాస్తవం, సృజనాశక్తి" అనే అంశంపై కృష్ణమూర్తిగారి ఆంగ్ల ప్రసంగం ఆహూతులలో పలువురికి అర్థం కాకపోయినా, విషయ వివరణ ఆకట్టుకొనే రీతిలో వుండింది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి సభకు అధ్యక్షత వహించి తిక్కవరపు రామిరెడ్డి దానశీలతను ప్రస్తుతిస్తూ అపర భోజునిగా అభివర్ణించారు.

ముఖ్య అతిథి డాక్టర్ కొట్రా కృష్ణమూర్తి మాట్లాడుతూ మనస్సులో రూపొందిన ఆలోచనను గుడ్డిగా అనుసరించడం మనుష్యులలోని వ్యాలోల మతికి కూడా తప్పని నియమ బద్ధ స్థితిని కల్పిస్తుంది. మానవ చరిత్రలో అటువంటి అనుయాయుల స్వానుభవాల ఉజ్జ్వలోదాహరణ లున్నాయని వీరినే ఐడియాలజిస్టులంటారన్నారు. ఐడియాలజిస్టులు కళాకారుల్లా సృజనాత్మక ప్రయోగాలు చేయగలరని చెప్పారాయన. భౌతిక విజ్ఞానంలోని మూడు రకాల లక్ష్యాలైన ఆదర్శ ప్రాయాలు, వాస్తవ రూపాలు, ఉపయోగార్థాల నమూనాలు మానవుని సృజనా శక్తి ఫలాలని నిర్వచించారు. ఆదర్శం వ్యక్తికి కేవలం మానసికం; వాస్తవ రూపం భౌతిక ప్రపంచంలో సృజనా కార్యం. సృజనా శక్తి అటు మానసికం, భౌతికమని కూడా చెప్పారు.

**రామిరెడ్డి జయంతి సభలో అమెరికా రసాయన శాస్త్రవేత్త విజ్ఞానదాయక ప్రసంగం**

రసాయనిక శాస్త్ర విశ్లేషణలోని గుణ నియంత్రణ సూత్రార్థ్యాన్ని సవివరంగా వివరించారు. ప్రాచీన కాలంలో జీవితానికి ఒరవడి లేదు. ఆ రోజుల్లో మానవుడు గతాన్ని గౌరవించి ప్రస్తుతాన్ని తృణీకరించేవాడు. ప్రస్తుత స్పీడ్ యుగంలో గతం మీద గౌరవం తగ్గి వర్తమానంపై గురి ఏర్పడిందన్నారు. కళాకారుల సృజనాత్మక పరివర్తనంలో ఆదర్శ స్థాపనకు వాస్తవ నిరూపణ వుదాహరణగా తాజ్‌మహల్‌ను పేర్కొన్నారు. షాజహాను ప్రేమ అనే ఆదర్శం, ఒక శిల్పి సృజనాత్మక శక్తి వల్ల ఒక మనోహరమైన సౌధ రూపంలో వాస్తవత్వం పొంది వెన్నెలలో తాజ్‌మహల్ అనే రసానుభూతిని కలిగిస్తున్నదని ఇదే ఆదర్శ, సృజనా, వాస్తవముల ఏకీకరణ అన్నారాయన. చివరలో ఒక పద్యం చెబుతూ పాశ్చాత్యులు విమానాలు నిర్మించి ఆకాశంలో ప్రయాణం చేస్తే మన దేశంలో పరాకాశంలో విహరించే ఆధ్యాత్మికు లున్నారని చెప్పి ముగించారు.

అనంతరం డాక్టర్ కొట్రా కృష్ణమూర్తి గారికి వర్ధమాన సమాజం, రోటరీ క్లబ్, పినాకినీ విద్యాపీఠాలువిడివిడిగా సత్కరించాయి. కొమండూరి శేషాద్రి బృందం వయోలిన్ కచ్చేరి ఆహూతులను వుత్తేజపరిచింది. సభకు జె.వి.రెడ్డి స్వాగతం చెప్పగా సాహిత్య సదస్సు కార్యదర్శి గోనుకొండ వెంకట సుబ్బయ్య వందనాలు చెప్పారు.

# అడిగేవాడు లేక అందరికీ అలుసే

ఎన్ని ప్రభుత్వాలు మారినా రాపూరు అభివృద్ధి మాత్రం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుంది. తెలుగుదేశం ప్రభుత్వానికి ముందుండిన కాంగ్రెస్ హయాంలో రాపూరుకు ఆర్టీసి బస్టాండ్, డిగ్రీ కళాశాల, ఫైర్ స్టేషన్లు మంజూరయ్యాయి. తెలుగుదేశం హయాంలో రాపూరులో గెలిచి మంత్రైన

ఆనం రామనారాయణ రెడ్డి వాటి పని మాత్రమే పూర్తి చేయించ గలిగారు. కొత్త పనులేమీ చేయించలేదు. నియోజక వర్గ కేంద్రమైనా ఇప్పటి వరకు మంచినీటి పథకం కూడా లేదు. టౌన్‌కు విద్యుత్ ప్రత్యేక ఫీడర్ పని సగంలోనే నిలిచిపోయింది. సబ్ జైలు, కోర్టు భవన నిర్మాణాలు పూర్తి అయినా ప్రారంభానికి నోచుకోలేదు. అగ్రికల్చరల్ డివో హెడ్ ఆఫీసును,

గిరిజన సహకార సంస్థ ఆఫీసును ఎత్తి వేశారు. శాసనసభ్యులు శ్రీ నువ్వుల వెంకటరత్నం నాయుడు అస్వస్థులుగా వుండడం వల్ల వివిధ అభివృద్ధి పనుల సత్ర నడకను అడిగే నాథుడే కరువవ్వడంతో రాపూరుపై సవతి తల్లి ప్రేమ చూపే అధికారులు, నాయకులు ఎక్కువ య్యారు.

## కావలి డివిజన్‌లో ఉత్తమ పంచాయతీలు

కావలి డివిజన్ పరిధిలోని 18 మండలాల్లో మండలానికి ఒకటి చొప్పున ఉత్తమ పంచాయతీలను ఈ సంవత్సరం ఎంపిక చేసినట్లు ఆర్డీవో సి.రాజరత్నం తెలిపారు. వ్యవసాయాభివృద్ధి, స్త్రీ సంక్షేమ కార్యక్రమాల నిర్వహణ, పారిశుధ్యం, బలహీన వర్గాల అభివృద్ధికి చేపట్టిన పనులు, పన్నుల వసూళ్లు మొదలైన అంశాలను పరిగణలోనికి తీసుకొని ఉత్తమ పంచాయతీలను ఎంపిక చేశారు. కావలి మండలంలో మద్దూరుపాడు, జలదంకిలో గట్టుపల్లి, కలిగిరిలో లక్ష్మీపురం, కొండాపురంలో గుడవల్లూరు, వింజమూరులో చాకలి కొండ, దుత్తలూరు, వరికుంటపాడులో పెద్దిరెడ్డిపల్లి, ఎస్.ఆర్.పురంలో శింగారెడ్డిపల్లి, ఉదయగిరి, మర్రిపాడులో ధర్మారావు చెర్వుపల్లి వున్నాయి. ఇవేగాక బోగోలులో అనంత బొట్లవారి కండ్రిగ, అల్లూరులో నార్త మోపూరు, బుచ్చిరెడ్డి పాళెంలో పంచేడు, సంగంలో పడుగుపాడు, కొడవలూరు, విడవలూరులను ఉత్తమ పంచాయతీలుగా గుర్తించారు.

## అన్నారెడ్డిపాళెం రైతుల ఆనందం

దువ్వూరు బ్రాంచి ఛానల్ క్రింద 3487ఎకరాల్లో రెండవ పంట వేసుకొనేందుకు అనుమతి మంజూరయ్యింది. ఇంతవరకూ ఈ ఛానల్ క్రింద రెండవ పంటకు అనుమతి ఇచ్చిన వారెవరూ లేరట. పై అధికారులను ఒప్పించి తమకు నీరు ఇప్పించిన ఇఫ్‌కో ఛైర్మన్ ఎల్లకూరు రామచంద్రారెడ్డికి, చేవూరు దేవకుమార్ రెడ్డికి కృతజ్ఞత చెబుతున్నారు అన్నారెడ్డిపాళెం, దువ్వూరు బ్రాంచి ఛానల్ రైతులు.

## బూదనం నిమ్మ రైతుకు బహుమతి

గూడూరులో ఇటీవల జరిగిన డివిజన్ వ్యవసాయ ఫల ప్రదర్శనలో బూదనం రైతు తాటిపర్తి రమణారెడ్డి, తోటలో పండించిన నాణ్యమైన నిమ్మకాయలు బహుమతి పొందాయి. రమణారెడ్డి ఎంత తీరిక లేకున్నా ప్రతిదినం మూడు గంటలపాటు తోటలోనే గడిపి ప్రతి కొమ్మా, రెమ్మను పరిశీలించి విశిష్టమైన ఉత్పత్తికి కారకులయ్యారట. తమ గ్రామరైతు బహుమతి పొందడం పట్ల గ్రామస్తుల ఆనందానికి అవధులు లేకుండా వుంది.

# రెండు నెలలుగా జీతాలు లేని మార్కెట్ కమిటీ

వెంకటగిరి కో ఆపరేటివ్ మార్కెటింగ్ స్టోర్స్ సిబ్బందికి గత రెండు నెలలుగా జీతాలు లేకపోవడంతో పడరాని పాట్లు పడుతున్నారు. స్టోర్స్‌లో వున్న ఏడుమంది సాధారణ వుద్యోగులకు జీతం చెల్లించలేని పరిస్థితి ఇంతకు ముందెన్నడూ కలుగలేదు. ఉన్నతాధికార్లు తగిన చర్యలు తీసుకోకుంటే ప్రజా పంపిణీ వ్యవస్థకు విఘాతం కలిగి ప్రజలు ఇబ్బంది పడేటట్లున్నారు.

## ప్రయాణీకుల సేవలో పార్శిల్ సర్వీసులు

సకాలంలో బస్సులు నడపడంలో ఆర్టీసి విఫలమవ్వడంతో రాపూరు మండల ప్రజలు పార్శిల్ సర్వీసు వ్యాన్లను ఆశ్రయిస్తున్నారు. ఆర్టీసి బస్సులకన్నా తక్కువ ఛార్జీ వుండడం, గమ్యానికి త్వరగా చేర్చడంతో ప్రజలు వీటివైపే మొగ్గు చూపుతున్నారు. తమ లాభానికి గండి కొడుతున్నాయని అర్టీసి అధికారులు, రవాణా శాఖాధికారులు గాని పట్టించుకోక పోవడంతో పార్శిల్ సర్వీసుల వ్యాన్లు వెలిగిపోతున్నాయి. అయినా గండికు లేని దురద కత్తిసీట కెందుకు చెప్పండి?

## కలిచేడులో ఆటల పోటీలు

సైదాపురం మండలం కలిచేడు మైకా కార్మిక సంక్షేమ సంస్థ ఆధ్వర్యంలో గనులలో పనిచేసే స్త్రీ, పురుషులకు 25 తేది ఆటల పోటీలు నిర్వహించారు. కేంద్ర కార్మికశాఖ డైరెక్టర్ హెచ్.కె. సరూల పోటీల ప్రారంభ సూచకంగా తెల్ల పావురాలను ఎగుర వేయగా డిప్యూటీ కమీషనర్ రాకేష్ చంద్ర జాతీయ పతాకాన్ని ఆవిష్కరించారు. కార్మిక సంస్థ ప్రత్యేకాధికారి వి.సాంబశివరావు మాట్లాడుతూ కలిచేడు సెంట్రల్ ఆసుపత్రి నిర్వహణ ఎంతో బాగున్నదని అందువల్ల ఎక్స్‌రే ప్లాంట్, మొబైల్ వ్యాన్‌ను మంజూరు చేస్తామన్నారు. క్రీడల్లో పలువురు స్త్రీ, పురుషులు వుత్సాహంగా పాల్గొన్నారు. 27తేది జరిగిన బహుమతి ప్రదానోత్సవ సభకు పి.సనత్ కుమార్‌రెడ్డి అధ్యక్షత వహించారు. రాఘవేంద్ర మైన్స్, సీతారామ మైన్స్, కళ్యాణరామ మైన్ కార్మికులు పలు బహుమతులు గెలుచుకున్నారు. స్నేహ

# నెల్లూరు లబ్ధప్రతిష్ఠులు

## విలేఖకుడు

### జనార్దనరెడ్డి

రాష్ట్ర కాంగ్రెస్ నాయకులు, మాజీ ముఖ్యమంత్రి శ్రీ నేదురుమల్లి జనార్దనరెడ్డి జిల్లాలో వున్నారు. బహుశా రేపో, ఎల్లుండో హైదరాబాదు వెళ్లవచ్చు. ప్రస్తుత మకాం వాకాడు.

### మంత్రులు

దేముళ్ల మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి ఈ రోజు కావలికి వచ్చారు; సాయంత్రం హైదరాబాదు రైలెక్కుతారు. 3 తేది మళ్లీ వస్తారు. 6 తేది వరకు వుండి రాజధానికి తిరిగి వెళ్తారు.

* * *

ఆర్థమంత్రి శ్రీ పసల పెంచలయ్య 31 తేది వచ్చారు. 6 తేది వరకు వుంటారు.

* * *

చక్కెర మంత్రి, జిల్లాతో ఏ సంబంధమూ పెట్టుకోని జిల్లా ఇన్‌ఛార్జి మంత్రి శ్రీ పి.సాంబశివ రాజు 4 తేది నెల్లూరు వస్తారు. 5 తేది ఆత్మకూరు, 6 తేది జిల్లా సమీక్షా మండలి సమావేశం. అదే రోజు తిరుగు ప్రయాణం.

### పెళ్లకూరుకు అంతర్జాతీయ అవార్డు

ఇఫ్కో ఛైర్మన్ పెళ్లకూరు రామచంద్రారెడ్డి గారికి ఆఫ్రికా ఖండంలోని సెనగల్ దేశం ఒక అరుదైన అవార్డును బహూకరించింది. ఫాస్ఫేటిక్ ఎరువుల ఉత్పత్తి, విస్తృత ప్రచారాల ద్వారా రైతులకు అనుపమాన సేవ చేసినందుకు

ఆర్డర్ ఆఫ్ లయన్ ఆఫ్ సెనగల్ అనే అవార్డును బహూకరించారు. అంతర్జాతీయ రంగంలో వివిధ రంగాలలో ఉత్తమ సేవలందించే వారికి ఆ దేశాధ్యక్షుడు స్వయంగా ప్రకటించే పురస్కారం ఇది. మొన్న 30 తేది ఢిల్లీలోని తాజ్ హోటల్‌లో అత్యంత విలాసవంతంగా ఏర్పాటుచేసిన సభ లో 13 దేశాల నుంచి వచ్చిన ప్రతినిధుల సమక్షంలో ఈ అవార్డు అందజేశారు. మన మంత్రులు జలగం జక్కర్ ఎక్సలెన్సీలో కూడా హాజరైనారు. రామచంద్రారెడ్డి గారు తనకు ఇఫ్కో పదవి వచ్చిన నాటి కంటే, ఎక్కువగా గర్వపడవలసిన, సంతోషించవలసిన పురస్కారం ఇది.

రామచంద్రారెడ్డిగారు ఛైర్మన్ అయిన తర్వాత ఇరాన్, కతార్ దేశాలలో 600 కోట్ల ఖర్చుతో ఇఫ్కో తరఫున రెండు ఎరువుల కర్మాగారాలు నిర్మిస్తున్నారు. ఈ ఫ్యాక్టరీలలో ఉత్పత్తయ్యే ఎరువులను తిరిగి మన దేశానికే తెచ్చి, దక్షిణ రాష్ట్రాలలో పంపిణీ చేస్తారు. ఉత్తర ప్రదేశ్ ప్రస్తుతం ఇఫ్కోకు వున్న రెండు కర్మాగారాలను 960 కోట్ల ఖర్చుతో విస్తరిస్తున్నారు.

రామచంద్రారెడ్డిగారికి మా మనఃపూర్వక అభినందనలు.

### సనాతన వేదాంత సభలు

పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారి ఆధ్వర్యంలో 27 నుంచి 29 వరకు నెల్లూరులో సనాతన వేదాంత జ్ఞాన సభలు ఆడంబరంగా జరిగాయి. పెద్ద సంఖ్యలో స్వామీజీలు, అసంఖ్యాక భక్త జన సందోహంతో ఆ మూడు రోజుల పాటు కోఆపరేటివ్ బ్యాంకు ఆవరణం కళకళ లాడింది. చెప్పాలంటే చాలా వుంది; స్థలం లేదు; పై వారం చర్చించు కుందాం.

### రంగడి తిరునాళ్లు వైభవంగా జరిగింది!

రంగనాయకుల పేట శ్రీ తల్పగిరి రంగనాథ స్వామి బ్రహ్మోత్సవాలు చాలా వైభవంగా, అశేష జన సందోహంతో జరిగాయి. తేరు రోజు జనంతో వీధులు పట్టలేదు. వైభవం కోల్పోయాడన్న దుష్ప్రచారంలో వుండిన రంగనాథుడి పట్ల నెల్లూరు జిల్లాలో భక్తి, విశ్వాసాలు ఏ మాత్రం సడల లేదనడానికి రుజువు అన్నట్లు తరలి వచ్చారు జనం. ఇదొక శుభ పరిణామం.

తిరునాళ్ల ఏర్పాట్లను ధర్మకర్తల మండలి సభ్యుడు శ్రీ ఉడతా వెంకట్రావు, ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ కెఎస్ నరసింహాచారి పర్యవేక్షించారు.

### శివాలయం సిగపట్లు

మూలపేట శివాలయానికి ధర్మకర్తల మండలి సభ్యులుగా ఏడుగురు మహిళలను నియమించబోతారు ఎమ్మెల్యే శ్రీ ఆనం వివేకానంద రెడ్డి. ఎ. అన్నపూర్ణమ్మ, వందిళ్లపల్లి అరుణమ్మ, రాచగిరి సులోచనమ్మ, పులిమి శైల్జ, పువ్వాడ సుధారాణి, తిక్కవరపు నళిని, బోడా పార్వతి, ట్రస్టీలుగా ప్రమాణ స్వీకారం చేశారు.

ఏడు కొప్పులు ఒక చోట చేరితే ఏమి జరుగుతుంది? ఛైర్మన్ ఎన్నిక పై సిగపట్లు పట్టుకొని, ఆనం సతీమణి రాజీ మంత్రమూ విఫలమై, ఒద్దిక కుదరక ఎన్నికే వాయిదా వేసుకొని అందరూ ఇళ్లకు వెళ్లారు. పదవుల దగ్గర కొచ్చేసరికి ఆడైనా, మగైనా పేచీలు తప్పవు కదా? ఆనం ఏదైనా సర్దుబాటు చేస్తేనే ఛైర్మన్ ఎన్నిక జరుగుతుంది లేకుంటే శివుడికి సిగపట్ల సేవే!

### రాయప్రోలు జయంతి

జమీన్‌రైతు జీవప్రదాత స్వర్గీయ నెల్లూరు శ్రీరామమూర్తి గత సంవత్సరమే, తనకు చిన్న నాట చదువు నేర్పిన కవయిత్రి పెనుబల్లి జయలక్ష్మమ్మ పేరిట రాయప్రోలు సుబ్బారావు జయంతి సభ నిర్వహించాలని తలపెట్టి, తొలి సభను దగ్గరుండి జరిపించారు. దురదృష్ట వశాత్తు ఆ తర్వాత కొద్ది కాలంలోనే ఆయన్ను కోల్పోయాము. ఆయన కోరిక పైన, ఆయనే ఏర్పర్చిన నిధితో వర్ధమాన సమాజం ఆ జయంతి సభను ఈ ఏడాది కూడా నిర్వహిస్తున్నది. 10 తేది టౌన్‌హాలులో జరిగే సభలో ఆచార్య కొత్తపల్లి వీరభద్ర రావు గారు సన్మానం స్వీకరిస్తారు. డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డి గారు అధ్యక్షిస్తారు. అందర్నీ ఆహ్వానిస్తున్నారు సమాజాధ్యక్షులు శ్రీ పి.వి. రమణారెడ్డి.

### పట్టపగలు నడిరోడ్డో హత్య

దర్గామిట్ట కరెంటాఫీసు దగ్గర 29 తేది ఉదయం 11 గంటలకు ఒక దారుణ హత్య జరిగింది. సునీల్ కుమార్ రెడ్డి అనే భక్తవత్సల నగర్ నివాసి అక్కడ ఒక బ్రాందీ షాపుకు వెళ్లి, కొద్దిగా తీర్థం పుచ్చుకొని, మెట్లు దిగుతుండినాడట. ఈలోగా నలుగురు యువకులు ఒక ఆటోలో వచ్చి సునీల్‌ను ఒడిసి పట్టుకొని, కసి దీరా కత్తితో పొడిచి, చచ్చాడని నిర్ధారించుకొని, మళ్లీ అదే ఆటో ఎక్కి నింపాదిగా వెళ్లిపోయారు. కొన్ని వందల మంది జనం కళ్ల ముందు జరిగి పోయింది ఘోరం. హతుడి శరీరం పై 14 కత్తిపోట్లుండినాయి. నరేంద్ర అనే మరొక స్థానికుడికి, సునీల్‌కు ఒక ఇళ్ల స్థలం విషయంలో వచ్చిన పేచీయే ఇంత ఘోరానికి కారణమని తెలుస్తున్నది. నరేంద్ర అతడి మిత్రులు పచ్చా వెంకటేశ్వర్లు, కృష్ణ, జయకృష్ణ అనే నలుగురు హంతకులని పోలీసు కేసు పెట్టింది. సునీల్ ఆటో డ్రైవరు; ఆ యూనియన్‌లో కూడా ఏదో పదవి వున్నట్లుంది. చిన్న చిన్న దౌర్జన్యాలు చేసేవాడట. రౌడీగా పేరు వుందట. రౌడీయిజం పై ఆధారపడే జీవితాలు ఎప్పటికైనా ఇట్లనే అంతమౌతుంటాయి.

హత్య జరుగుతుంటే చుట్టు ప్రక్కల అంగళ్ల వారు భయపడిపోయి, హడావుడిగా షట్టర్లు దించేసి, పారిపోయారు. హంతకులను నివారించను, లేదా తరుముకొను ఒక్కరు కూడా ప్రయత్నించలేదు.

### సణుగుడు

(4 పేజీ కొరవ)

జ్ఞాపకం రాదు. అవి లేకుంటే నిత్యం కుల నామస్మరణే! ముద్రగడ పద్మనాభం ఉదంతం చూడండి; వ్యక్తిగా మంచివాడు, నిజాయితీ పరుడు, నిష్కళంకుడు; కాని కులం పేరుతో రాజకీయాలు చేయడానికి వెనుకాడడం లేదు.

అన్ని పార్టీల నాయకులూ - ఢిల్లీ నుంచి గ్రామాల వరకు కులం పేరుతో సమాజాన్ని విడగొట్టి, ముక్క చెక్కలు చేసి, ఎక్కడి కక్కడ గిరులు గీసి, పరిధులు నిర్దేశించి నానా గందరగోళం సృష్టిస్తున్నారు. ఈ వైఖరి సమాజాన్నీ, మనల్నీ ఎక్కడకు తీసుకు వెళ్తుంది? ఏమై పోతున్నాం మనం? ఎటు పోతున్నాం మనం? ఈ కుల విష భాండాన్ని జనం నెత్తిన పెట్టి బలవంతంగా త్రాగిస్తున్న నాయకులను నిలువరించే వారెవరూ లేరా?

## సణుగుడు

(4 పేజీ కొరవ)

సభ్యుడు కూడా. బయట మైకు దొరికితే వినేవారి తలలు వాచిపోయే వరకు వదలి పెట్టని వారు. అసెంబ్లీలో పలికితే ముత్యాలు రాల్తాయన్నట్లు వుండి పోతున్నారు కారణమేమిటి చెప్మా!

శేషారెడ్డి గారికి కంగ్రాచ్యులేషన్స్!

* * *

ఈ దేశంలో ప్రజాస్వామ్యం బ్రతికి వుందంటే అది న్యాయవ్యవస్థ పుణ్యం. కోర్టులున్నాయనే ధైర్యమే చాలా సందర్భాలలో ప్రజాస్వామ్యం పట్ల విశ్వాసం సడలకుండా నిల్పుతుంటుంది. ఆ న్యాయవ్యవస్థకే కళంకం అంటుకుంటే? మురికి పడితే? అవినీతి దుర్గంధం అలుముకుంటే? ఆశ్రిత పక్షపాతపు అంటురోగం సోకితే? ఇంక ప్రజలకు దిక్కెవరు? ప్రజాస్వామ్యానికి రక్షణ ఏది? సుప్రీం కోర్టు న్యాయమూర్తి జస్టిస్ రామస్వామి దురంతాలు విన్నాం; చూశాం! అది ఉన్నత న్యాయస్థానం కాబట్టి, అలజడి కూడా ఉధృతంగా వచ్చింది. కాని క్రింది స్థాయి న్యాయమూర్తులు స్వచ్ఛత కోల్పోతే, కోర్టులలో కుంభకోణాలు జరిగి పోతుంటే ప్రజలకు తెలిసేదెట్లా? ఆందోళన ప్రారంభమయ్యేదెట్లా? మన కోర్టులన్నింటిలో న్యాయదేవతకు పూజలు అందుతున్నాయా? న్యాయమూర్తులు ఆమెకు పరిరక్షకులుగా వ్యవహరిస్తున్నారా?

న్యాయాన్ని అర్థించి, న్యాయం జరుగుతుందని విశ్వసించి కోర్టులకు వెళ్లేవారికి నిజంగా న్యాయం జరుగుతున్నదా? సాక్ష్యాలు, ఆధారాలు కాకుండా ఇతర పలుకుబడులు, ప్రలోభాలతో తీర్పులు ప్రకటించే సంఘటనలు వుంటే ఎవరైనా ప్రశ్నించ గల్గుతున్నారా? లోకానికి వెల్లడి చేయగల్గుతున్నారా?

కోర్టుల తీరు పరిశీలిస్తుంటే ఇటువంటి ప్రశ్నలెన్నో తలెత్తుతున్నాయి. కోర్టు కేసుల నడవడిపైన, తత్సంబంధిత న్యాయవాదుల ప్రవర్తన పైన పలు ఫిర్యాదులు, పుకార్లు వినవస్తున్నాయి. చివరకు న్యాయమూర్తులు - జిల్లా స్థాయి కాని, మెజిస్ట్రేట్ స్థాయికాని, మరే స్థాయి గాని చాలా రిజర్వుడుగా వుండేవారు. ఎంతో అవసరమైతే తప్ప వారు పబ్లిక్ ప్రదేశాలకు వచ్చేవారు కాదు; జనంతో కలిసేవారు కాదు. రాజకీయవాదుల వద్ద కన్పించేవారు కాదు. బంధు మిత్రులను కోర్టు వ్యవహారాలు మాట్లాడనిచ్చేవారు కాదు. బహుమతులు, కాంప్లిమెంట్లు స్వీకరించేవారు కాదు. ఎంతటి వారైనా న్యాయమూర్తికి ఎదుట నిలబడి మాట్లాడాలంటే జంకేవారు. ఇప్పుడా పరిస్థితి లేదు. న్యాయమూర్తుల గురించి జనం చాలా ఫ్రీగా మాట్లాడేస్తున్నారు. అతిథి భవనాలలో, ఇళ్లలో కూడా వారు అధికారులతో వున్న నాయకులను కలవడం సాధారణమై పోయింది. [illegible] బంధుమిత్రుల విందువినోదాలు వెదకడం సాధారణమై పోయింది. ఫలానా వారని పేరు చెప్పడం, వేలెత్తి చూపడం సాధ్యం కాదు కాని, కక్షిదారులతో నేరుగా, లేదా న్యాయవాదుల మధ్యవర్తిత్వంతో బేరసారాలు జరుగుతున్నట్లు వదంతులు వినిపిస్తున్నాయి. ఇవి నిజమా, కల్పితాలో తెలియదు. కాని ఇటువంటి పుకార్లు, ప్రచారాలు న్యాయస్థానాల పైనే ప్రజలకు నమ్మకాన్ని నశింప జేస్తాయి.

నెల్లూరులో గుమ్మడి [illegible] దొంగలెవరైనా వుంటే [illegible] తరుముకోవడం కాదు - దారి తప్పిన ప్రవర్తనను సరిదిద్దు కోవడం మంచిది. న్యాయమూర్తులను విమర్శించకూడదు; విమర్శలకు కంటెంప్ట్ ఆఫ్ కోర్ట్ విచారణ, శిక్షలన్న భయం విమర్శకుల నోళ్లను ఎంతో కాలం మూయలేదు.

* * * *

నలుగురు ఒకచోట చేరితే కుల ప్రస్తావన; దినపత్రిక తెరిచి చూస్తే కుల సంబంధ వార్తలు, ప్రకటనలు; నాయకులు వేదికెక్కితే కులం పేరుతో వీరావేశాలు; ఎక్కడ చూసినా కులం కంపే. కుల గజ్జిని వంటికంతా ప్రాకించుకొని సహించినట్లు గీరుకుంటూ తిరగడం ఫ్యాషనై పోయింది.

ఎన్టీఆర్ హయాంలో ప్రారంభమైంది అసహ్యకర సంస్కృతి. కలరా, ప్లేగు వ్యాధుల వలె వూరూరు, ఇల్లిల్లూ ప్రాకి, ప్రజల మనసులలో దూరి, చెద పురుగుల వలె దొల్చి వేస్తున్నది. కులం ప్రస్తావన తేవడానికి సిగ్గు పడాల్సింది పోయి, చాటుమాటుగా చెవులు కొరుక్కోవలసింది పోయి పబ్లిక్‌గా, అదేదో ఘనతైనట్లు మాట్లాడేస్తున్నారు. ఏ ఆలోచన చేసినా ఆ కోణం నుంచే. విజయ భాస్కరరెడ్డి గారు ఈ ఏడాదిన్నరలో చేసిన నియామకాల జాబితా ఒకటి చూశాను. అందులో 80 శాతం ఆయన కులస్తులే. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి నుంచి, మెజిస్ట్రేట్ కోర్టు స్వీపరు వరకు కులం అర్హతగా నియామకాలు జరిగి పోతున్నాయని గలభాగా వుంది. పివి నరసింహారావు కుల పిచ్చిపై ఆ మధ్య ఒక ఆంగ్ల వారపత్రిక పెద్ద పట్టిక ఇచ్చింది. బ్రాహ్మణాధిక్యం పునరుజ్జీవనానికి ఆయన చాప క్రింద నీరువలె పని చేస్తున్నారని ఆరోపణ చేసింది.

కాన్షీరాం సంగతి తెలిసిందే. తమ కుల అభ్యున్నతి కంటే, పరాయి కులాల పట్ల ద్వేషం పెంచడానికి ఆయన, ఆయన అనుచర బృందం సాక్షాత్తు మహాత్మా గాంధీని వీధిలోనికి లాగుతున్నారు. కుల అసమానతల నిర్మూలనకు జీవితాన్ని పణంగా పెట్టి పోరాడిన మహాత్మునికి కులం రంగు పూసే నీచ సంస్కృతి మన కళ్ల ఎదుటే విష వాయువులాగా ప్రసరిస్తుంటే చూస్తూ వుండి పోతున్నాం మనం.

వెనుక బడిన కులాల పేరుతో జరుగుతున్న ఆగం ఇంకొక [illegible] శృతి మించి పోతూంది. కులం సంఖ్యను చూపి, ఓట్ల బ్యాంకుల గారడీలు చేసి, బ్లాక్‌మెయిల్ చేయడం ఒక ఆనవాయితీగా మారింది. పదవులిస్తే కులం పేరు కూడా

కొరవ 6 పేజీలో

## మానవాభ్యుదయాన్ని ధ్వనింపజేసే కథల సంపుటి

# మనిషి

శ్రీ పొట్లూరి సుబ్రహ్మణ్యం రూపొందించిన మూడవ కథల సంపుటికి "మనిషి" అని నామకరణం చెయ్యటం అర్థవంతంగా వుంది. ఎందుచేతనంటే, ఈ సంపుటిలో వున్న పది కథలూ మనిషి జీవిత వృత్తంలోని విభిన్న దృశ్యఖాలకు, వాస్తవ దృశ్యాలకు మనోజ్ఞమైన అక్షర రేఖలుగా నిలిచాయి గనుక.

"మనిషి" అనే పదంలో ప్రమోదకరమైన, ప్రమాదకరమైన రెండు ఇంగ్లీషు పదాలు ఇమిడి వున్నాయి. ఒకటి "మని" (డబ్బు), రెండవది "షి" (స్త్రీ). ఈ డబ్బును, స్త్రీని సద్వినియోగ పరచుకుంటే మనిషి జీవితం మహోన్నత మవుతుంది. సామాన్యుని బాధను గుర్తిస్తుంది. దుర్వినియోగ పరిస్తే అధః పతనమవుతుంది. స్వార్థశక్తిగా అందరినీ దోచుకుంటుంది. మనిషికి సంబంధించిన ఈ అంతరార్థాన్ని, పర్యవ్యూహం పరిసరాల్ని విశదీకరించి, తన కథల్లో వెలుగు వెల్లువలు విరియించాడు రచయిత. వివిధ స్థాయిల్లోని మనిషి పరిస్థితుల ప్రతి కదలికకు చలించి, ప్రతి చలనానికి స్పందించి ప్రతి కథలో మానవాభ్యుదయాన్ని ధ్వనింప జేశాడు. దుఃఖ భూయిష్టమైన జీవన యాత్రలో, బాధలను దిగమ్రింగిన కన్నీటి ధారను, రక్తం కనిపించని కత్తి కోతలను, శబ్దం వినిపించని ముష్టి ఘాతాలను

> **గ్రంథసమీక్ష**
> రచయిత
> **పొట్లూరి సుబ్రహ్మణ్యం**
> సమీక్షకుడు
> **గ్రిద్దలూరు గోపాలరావు**
> ప్రతులకు
> **మహీధర్ పబ్లికేషన్స్**
> పూలతోటవారివీధి,
> కోవూరు - 524 137.
> నెల్లూరు జిల్లా
> వెల రూ. 40/-

గమనించిన రచయిత, సంస్కారం ఏ దిశగా పయనించాలో నిర్దేశించాడు. మానవతకు ప్రాతినిధ్యం వహించాడు. మానవ ధర్మం ప్రబోధించాడు. మనిషిలో మార్పును వాంఛించాడు.

కథా వస్తువుకు ఎంత ప్రాతినిధ్యం అమర్చాడో, రచనా శిల్పానికి అదే ప్రాతినిధ్యం కూర్చాడు. కల్తీ లేని వాడుక భాష ఉపయోగించాడు. "తీరని కోరిక, గుడ్డి దీపం, అందని ఆకాశం" కథల్లోని పల్లె భాష సొంపులు, వంపులు భూమ్మీద వాన చినుకు రాలినప్పటి పరిమళాన్ని ఆస్వాదింప జేస్తాయి. మిగతా కథల్లోని పుష్టికరమైన అక్షర సౌందర్యం, చదువరులకు, పువ్వు మీద వాలిన తుమ్మెద పొందే రసానుభవం కలిగిస్తుంది.

ముఖ చిత్రం, చిత్రకారుని భావనాశక్తికి మనిషి భావానికి బింబ ప్రతిబింబాలుగా నిలిచింది. కొవ్వొని, దాని మీద స్త్రీ ఎర్రని పెదాలను చిత్రించి "మనిషి" కి జీవలక్షణం కల్పించారు చిత్రకారుడు.

కళాదేవత కొలువు దీరిన రత్నాల కాలగా భాసిల్లి, పద్మభూషణ డాక్టర్ కొంగర జగ్గయ్య హృదయానికి అంకితం కావటం ఈ కథల సంపుటికి ప్రత్యేకంగా ప్రాప్తించిన పరమ సౌభాగ్యం. బహు జనాభిమానం సంపాదించ గల ఈ కథల సంపుటి బహు జనోపకారి అవుతుంది.

### జిల్లా వార్తలు

(5 పేజీ కొరవ)

పూర్వకంగా స్థానిక పాఠశాలలోని ఉపాధ్యాయులు ప్రదర్శించిన 'పూజకు పనికిరాని పువ్వు' నాటిక పలువుర్ని ఆకర్షించింది. చివరిరోజు కార్యక్రమాలను జయప్రదం చేసిన వారందరికీ పరిపాలనాధికారి ఎస్.డి.ఇషాక్ ధన్యవాదాలు తెలిపారు.

### విద్యానగర్ ఇంజనీరింగ్ కళాశాల వార్షికోత్సవం

విద్యానగర్ ఎన్.బి.కె.ఆర్. ఇంజనీరింగ్ కళాశాల వార్షికోత్సవం మార్చి 29 తేది ఘనంగా జరిగింది. జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ ఐ.గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు. ఎస్.వి.యు. వైస్ ఛాన్సలర్ పి.జయరామిరెడ్డి, కళాశాల కరస్పాండెంట్ ఎన్.పద్మనాభరెడ్డి ముఖ్య అతిథులుగా విచ్చేశారు. ప్రిన్సిపల్ ప్రొఫెసర్ జి. ప్రభాకరరావు వార్షిక నివేదిక సమర్పించారు. అనంతరం ప్రొఫెసర్ గోపాలరెడ్డి మాట్లాడుతూ రాష్ట్రంలోని ప్రథమ శ్రేణి కళాశాలల్లో ఎన్.బి.కె.ఆర్ కళాశాల ఒకటని, పూర్వ విద్యార్థులు నెలకొల్పిన వున్నత విలువలు, ప్రతిభా పాటవాలను ప్రస్తుతం చదివే విద్యార్థులు మననం చేసుకొంటూ ముందడుగు వేయాలన్నారు. విద్యార్థులచే స్వంతంగా ఆలోచింపచేసే అవకాశం, అవసరం కలుగ చేసినప్పుడే ఇంజనీరింగ్ విద్యకు సార్థకత; అందుకోసం సాంకేతిక విద్యా విధానాన్ని మార్చు చేయాలని ప్రొఫెసర్ జయరామిరెడ్డి సూచించారు. ఈ సంవత్సరం ఉత్తమ విద్యార్థిగా ఎన్నికైన శ్రీనివాస గౌతమ్, గత సంవత్సరం యూనివర్సిటీ ప్రథముడుగా నిలిచిన విద్యార్థి సిహెచ్ వాసు, ఆటల్లో ప్రతిభ కనపర్చిన జహీర్ అలీఖాన్‌ను ఈ సందర్భంగా అభినందించారు. వివిధ పోటీల్లో గెలుపొందిన విద్యార్థిని విద్యార్థులకు ప్రొఫెసర్ జయరామిరెడ్డి బహుమతి ప్రదానం చేశారు.

### సమస్యల పరిష్కారానికి సమితి

కోటపల్లి గూడూరు మండలంలోని సమస్యల పరిష్కారానికి ఒక సమితి ఏర్పాటయ్యింది. రాజకీయాలకు అతీతంగా పని చేస్తామని ప్రజలు తమను వుపయోగించుకో వచ్చని సమితి కార్యదర్శి వల్లూరు మాధవరావు కోరుతున్నారు.

### మాజీ గ్రామాధికారికి సన్మానం

రాష్ట్రంలో ప్రప్రథమంగా గ్రామాధికారుల వసతి భవనం గూడూరులో నిర్మించి, మాజీ గ్రామాధికారి చెన్నూరు పట్టాభిరామయ్యను ఇటీవల సన్మానించారు. 30 ఏళ్ల క్రితం భవన నిర్మాణానికి ఆయన పడిన కష్టాలను గుర్తించి ప్రస్తుతం రాష్ట్ర గ్రామాధికారుల సంఘ అధ్యక్షులు దేవళ్ల దశరథరామిరెడ్డి నాయకత్వాన గూడూరు సబ్ కలెక్టర్ సునీల్‌వర్మ చేత సన్మానింప చేశారు. పాతతరం నాయకులను గుర్తించి గౌరవించడం మంచి సాంప్రదాయమైనా ఆ రోజుల్లో సంఘ అభివృద్ధికి పాటుపడ్డ ఏ ఒక్కరికీ ఆహ్వానం పంపని వెలితి మాత్రం మిగిలింది.

### వెంకటగిరిలో విద్యార్థి మృతి

హోలి పండుగ సందడి వెంకటగిరిలో ఒక విద్యార్థి ప్రాణాన్ని బలి తీసుకుంది. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యాండ్‌లూమ్ టెక్నాలజీ శిక్షణా సంస్థలలోని విద్యార్థులు ఒకరి పై మరొకరు రంగులు చల్లుకొని హోలీ సంబరాల్లో మునిగి తేలారు. అనంతరం విద్యార్థులంతా ఈత కొట్టేందుకు సమీపంలోని బావి వద్దకు వెళ్లారు. అందరితో పాటు బావిలోకి దిగి నీటిలో మునిగిన జె.వి. సుబ్బారావు (19) చాలా సేపటి వరకు పైకి రాలేదు. వెంటనే అతని స్నేహితులు కేకలు పెట్టుకొంటూ వెళ్లి పొలాల్లో పనిచేస్తున్న రైతులను పిలిచి వాళ్ల సహాయంతో సుబ్బారావును వెలికి తీశారు. కాని అప్పటికే అతను మృతి చెందాడు. సుబ్బారావు చీరాల వాసి. శవానికి పోస్టుమార్టమ్ నిర్వహించి అతని బంధువులకు అప్పచెప్పి వెంకటగిరి పోలీసులు కేసు దర్యాప్తు చేస్తున్నారు.

### రసూల్ ఎన్‌కౌంటర్ పై కమిషన్ తీర్పుకు నిరసన

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం కార్యకర్తల శిక్షణా తరగతులలో పాల్గొనేందుకు కావలి వచ్చిన ఎపిసియల్‌సి ప్రధాన కార్యదర్శి డాక్టర్ బాలగోపాల్ ఆదివారం నాడు పత్రికా కలవారితో మాట్లాడారు. 1991 సంవత్సరం అంతంలో హైదరాబాదు ఉదయం దినపత్రిక విలేఖరి రసూల్‌ను ఆయన మిత్రుడు జయప్రకాష్‌లను ఎన్‌కౌంటర్ పేరుతో పోలీసులు కాల్చి చంపిన కేసు పై ఏర్పాటైన టి.ఎల్.ఎన్. రెడ్డి కమిషన్ విచారణ నివేదికను తప్పు పట్టారు. రసూల్‌ను పోలీసులు తుపాకులతో కాల్చి చంపారన్న విషయం ధృవీకరిస్తూ సాక్ష్యాధారాలు చూపించడంలో ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం విఫలమయినాయని చెప్పడం పై డా బాలగోపాల్ అభ్యంతరం

## శివారెడ్డి పద్యాలు

**పెళ్లకూరు రామచంద్రా రెడ్డి**

పచ్చి కాంగ్రెసోరు, స్వచ్ఛందసేవాప
రాయణుండు దిట్ట రామచంద్ర
రెడ్డి, అంతటోరు లేరు అనినేనన్నడంల
నూటికొకడె, కాదు కోటికొకడు!

**ఎస్పి**

నీదు నేర్పుకూర్పు నెల్లూరు పోలీసు
వర్గమునకు గొప్పవన్నెదెచ్చె
తాము నాకు క్రొత్త తర్వాత వివరిస్త
మంచినెర్ర ఎస్పి! మనవి జేస్త!

రకరకాల కార్డు రాష్ట్రాధిపతులైన
మూలముల డబ్బు మూల్గుతున్న
ఇండియాకు పెద్ద ఇలవేల్పు ఎరబుట్ట
లేకపోతె పెద్ద పాకు దెబ్బ!

**బోయి భీమన్న**

భీమన్న! నీ కవితలు
సామాన్యముగాదు ఛందహ్కార
శ్రీ ముద్రామయణమగు, పండిత
పామరులకుఅదియొకబోగిపండుగ,సెలవ్!

**అజిమ, రహంతుల్లా**

అందగత్తె అజిమ అపరంజి బంగారు
చందమామ వరుడు, ఏమనందు పెళ్లి
వైభవమ్ము, కాదు వర్ణింప సాధ్యమ్ము
స్వీట్లు, వడలు లడ్లు లాట్లు లాట్లు!

మళ్లి జన్మకేను మహమ్మదీయుడనౌత
పల్లెటూరి కవికి ప్రాప్తముంటె
మాపురేపు గూడ మత్స్యమాంసాదుల్తొ
మునిగి తేల్ర, పొద్దు ముసలి తనము!

తెలియచేశారు. తిరుగులేని సాక్ష్యాలను కమిషన్ ముందుంచినా న్యాయమూర్తి చేసిన నిర్ధారణ ప్రజలకు న్యాయవ్యవస్థ పై విశ్వాసం పోగొట్టేదిగానూ, తెలంగాణా ప్రాంత విలేఖరులలో అభద్రతా భావాన్ని కల్గించేది గానూ తమకు నచ్చని వారిని ఎన్‌కౌంటర్ పేరుతో హత్యచేసి తప్పించుకోవచ్చునన్న విశ్వాసాన్ని పోలీసులలోనూ కల్గించేది గానూ వుందని డా. బాలగోపాల్ ఆందోళన వ్యక్తం చేశారు.

రసూల్ పత్రికా విలేఖరి అన్న విషయం డి.ఎస్.పి. రాజయ్యకు, ఎస్.పి. భాస్కర రెడ్డికి వారి క్రింద అధికారులకు బాగా తెలుసన్నారు. డిసెంబరు 27 న రసూల్‌ను కాల్చి చంపి, 29 తేది వరకు గుర్తు తెలియని నక్సలైట్లు అని ఉద్దేశ పూర్వకంగా ప్రకటించారని, ధర్మవరం ఎం.ఎల్.ఏ. హోంమంత్రి అనుమతితో శవాలను తీసుకెళ్లడానికి మార్చురీకి వెళ్లేలోగా పోలీసులు అక్కడి శవాలను మాయం చేశారు. నల్గొండ జిల్లా ఆలూరు ఎస్.ఐ. 28 వ తేది రసూల్ బంధువులను జరగరానిది జరిగి పోయినది మీరు అయినా జాగ్రత్తగా వుండండని చెప్పడం, 27 వ తేదిన రసూల్ మిత్రుడు కారు డ్రైవరు ప్రకాష్‌ను మేడ్చల్ పోలీసులు పట్టుకెళ్లి చావగొట్టి రసూల్ నక్సలైట్ అని మూడు హత్యలతో సంబంధం వుందని బలవంతంగా స్టేట్‌మెంట్ రాయించు కోవడం జరిగింది. అదే రోజు రాత్రి రసూల్‌ను కాల్చి చంపారు. ఈ విషయాలన్నింటిని సాక్ష్యాధారాలతో కమిషన్ ముందు వుంచామని, అయినా రసూల్ ఎన్‌కౌంటర్‌లోనే మరణించాడని కమిషన్ నిర్ధారించడం దురదృష్టకరమని డా. బాలగోపాల్ చెప్పారు.

రాష్ట్రంలో జరిగిన 497 ఎన్‌కౌంటర్ హత్యలతో పాటు రసూల్ హత్యకేసును జాతీయ మానవ హక్కుల సంఘానికి నివేదిస్తామని తెలిపారు.

### నెల్లూరు వైపే మళ్లీ అందరి చూపు

సారా వుద్యమం ద్వారా ప్రపంచ వ్యాప్తంగా పేరు గడించిన నెల్లూరు జిల్లా మహిళలు పొదుపు లక్ష్మి పథకం ద్వారా సాధిస్తున్న ప్రగతి నేడు దేశవ్యాప్తంగా చర్చనీయాంశమైందని జిల్లా కలెక్టర్ ఎం. సాంబశివ రావు చెప్పారు. 25 తేది బుచ్చిరెడ్డిపాళెంలో పొదుపులక్ష్మి మహిళా సదస్సులో ప్రసంగించారు. జిల్లా మహిళలను ప్రోత్సహించను ఇక నుండి మంజూరయ్యే ప్రభుత్వ పథకాలన్నీ మహిళలకే ఇస్తామన్నారు. పొదుపు లక్ష్మి . పథకాన్ని విజయవంతంగా మూడు సంవత్సరాల పాటు నడప గలిగితే మహిళలే ప్రభుత్వానికి అప్పు ఇచ్చే దశకు చేరుకోగలరని చెప్పారు. ఇప్పటి వరకు జిల్లాలోని 46 మండలాల్లోని మహిళలు 50 లక్షల రూపాయలకు పై గానే పొదుపు లక్ష్మి క్రింద పోస్టాఫీసుల్లో జమ చేసి వుండడం మహిళల ప్రగతికి నిదర్శనమన్నారు. ఈ పథకం వల్ల స్త్రీలలోని న్యూన్యతా భావం పోయి ఆత్మవిశ్వాసం వెల్లి విరుస్తుందన్నారు. మహిళలు సంఘటితంగా వుండి గ్రామాల్లో అక్రమాలకు పాల్పడే చౌక దుకాణాల డీలర్లను నిలదీయాలని జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర సలహా ఇచ్చారు. సంఘటితంగా వుండే ఏదైన సాధించగలమని చెప్పారు. కార్యక్రమంలో పొదుపులక్ష్మి ప్రత్యేక అధికారిణి విజయభారతి, ఎమ్మార్వో భాస్కర రావు, ఎమ్డీఓ సి.ఎన్. సుబ్రహ్మణ్యం పాల్గొన్నారు.

## పంచాంగం

28 తేది సోమవారము నుండి శుక్రగురువుల సమసప్తక స్థితి మంచిది కాదు. ముహూర్తములు లేవు.

### ఏప్రెల్ తిథులు

ఫాల్గుణ బహుళ

తే2 శని సప్తమి రా.గ. 2.12 వ
తే3 ఆది అష్టమి రా.గ.12.51వ
తే4 సోమ నవమి రా.గ. 12.00 వ
తే5 మంగళ దశమి రా.గ. 11.34 వ
తే6 బుధ ఏకాదశి రా.గ.11.40వ
తే7 గురు ద్వాదశి రా.గ. 12.15 వ
తే8 శుక్ర త్రయోదశి రా.గ. 1.23 వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఒంగ

సినిమా సినిమా సినిమా సినిమా సినిమా సినిమా

# ఇవి పిచ్చి వేషాలు- అభిమానం కానేకాదు!

''నా వృత్తి పాతడం. నా గానం మీకు నచ్చింది. మీరు నాకు అభిమాని అయ్యారు. అంతవరకు బాగానే వుంది. కాని దానిని నిరూపించడం ఎందుకు?'' అని ఎస్.పి. బాల సుబ్రహ్మణ్యం ఇటీవల మన రాష్ట్రం నుంచి తనను చూడడానికి వచ్చిన ఒక అభిమానిని మందలించారు. బాలు చూస్తుండగానే ఆ అభిమాని చివాలున తన జేబులోంచి బ్లేడు తీసి, తన బొటన వేలికి గాయం చేసి, ఆ నెత్తురుతో హఠాత్తుగా బాలు నుదుట తిలకం పెట్టాడు. ''ఏటిని పిచ్చి వేషాలంటారు. నేనేం మానవాతీతుడ్ని కాను,'' అన్నారు బాలు.

## రక్తతిలకం దిద్దిన వెర్రి అభిమానికి ఎస్పిబాలు చీవాట్లు

## చిత్ర నిర్మాతకు ఫోరం వడ్డింపు

చిత్రం వసూళ్లు పెరగడానికి ప్రేక్షకులకు బహుమతుల ఆశ చూపించడం కొందరికి పరిపాటి. 1993లో అన్నపూర్ణ స్టూడియోస్ వారి ''రక్షణ'' విడుదల సందర్భంలో యాభై రూపాయలు మని ఆర్డర్ ద్వారా పంపిన వారికి ఆ చిత్రం తాలూకు ఆడియో క్యాసెట్, కీ చెయిన్, ఒక లాటరీ టిక్కెట్టు, సినిమా టిక్కెట్టు గల ఒక పెట్టె పంపిస్తామని ఆ నిర్మాతలు కొన్ని దిన పత్రికలలో ప్రకటనలు చేశారు. వి.సోమరాజు అనే వ్యక్తి ఆ విధంగా తాను పంపిన యాభై రూపాయలకు గిఫ్ట్ బాక్స్ రాలేదని, కనీసం తన ఉత్తరానికి సమాధానం కూడా రాలేదని పశ్చిమ గోదావరి జిల్లా వినియోగదారుల ఫోరంలో ఫిర్యాదు చేశాడు. ఆ యాభై రూపాయలకు 18 శాతం వడ్డీ చెల్లించడం తోపాటు నష్ట పరిహారం కింద వంద రూపాయలు, ఖర్చుల కింద 150 రూపాయలు చెల్లించాలని నిర్మాత అక్కినేని వెంకట్‌ను ఫోరం ఛైర్మన్ ఎన్. రామలింగేశ్వర రెడ్డి ఆదేశించారు.

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

ఆలయం సినిమా లిమిటెడ్ ''బొంబాయి''. శ్రీ లక్ష్మి పద్మజా మూవీస్ ''డేంజర్ యమ డేంజర్'', అర్జున్ ఆర్ట్ ప్రొడక్షన్స్ ''డైరెక్టర్ గారి పెళ్లాం''. శబరి మూవీ మేకర్స్ ''ఘరానా ఖైదీ'', గిరిధర్ మూవీస్ '' ఘరానా తమ్ముడు'',ఆర్.జి.సి. ఫిలిమ్స్ ''ఇండియా నెంబర్ వన్'', లావణ్య చిత్ర కంబైన్స్ ''కొండపల్లి రౌడీ''. శ్రీమంత్ ప్రొడక్షన్స్ ''నిందితుడు''. భరత్ ఫిలిమ్ సర్క్యూట్ ''ప్రజా రక్షకుడు'', టి.కృష్ణ మెమోరియల్ పిక్చర్స్ ''ప్రియాంక''. రవి ఆర్ట్స్ ''రాజకీయం''. సాయిశ్రీ మూవీస్ ''రైతు భారతం'', శ్రీ షిర్డీ సాయి ప్రొడక్షన్స్ ''రెడ్డిగారి ఆవేశం''. వి.గుణశేఖర్ చిత్రం ''వేటగాడు 1994''. శ్రీ చిత్ర క్రియేషన్స్ ''టాప్ హీరో''.



పరుగోపరుగు చిత్రంలో ప్రదీప్ శక్తి, గిరిబాబు, రాజేంద్రప్రసాద్, అనంత్.

# ఖల్ నాయక్‌కు నాయిక దొరకడం ఎంత కష్టమైందో!

''ఖల్‌నాయక్'' చిత్రం తెలుగులో పునర్నిర్మింపబడుతూన్న విషయం అందరికీ తెలిసిందే. నాయికగా ఖుష్‌బూను అడిగారు. ఆమె ముందు సరేనంది. ఆ తర్వాత విముఖత చూపింది. మధుబాలను సంప్రదించారు. రెండు రోజులయ్యాక ఆమె కాల్‌షీట్లు సర్దుబాటు చేయలేక పోయానంది. చివరికి సుకన్య బుక్ అయ్యింది. అసలు అర్జున్‌ను హీరోగా బుక్ చేసి, ఆయన చేత దర్శకత్వం చేయించాలనుకున్నారు. అదీ కుదరలేదు. ఇప్పుడు వినోద్‌కుమార్, రఘు నటించనున్నారు. ఎ.జగన్నాథ్ దర్శకుడు.

## అన్నీ ''టాప్ లే, నెంబర్ వన్ లే''

8 కోట్ల జనాభా గల మన రాష్ట్రంలో 4 కోట్ల రూపాయల పెట్టుబడితో చిత్రాలు తీసే నిర్మాతలు ప్రేక్షకులను ఆకర్షించడానికి పెట్టే టైటిల్స్ చూస్తూంటే ఎంతో తమాషాగా ఉంటోంది. కృష్ణతో ఎస్.వి.కృష్ణారెడ్డి దర్శకత్వంలో తయారైన ''నెంబర్ వన్'' చిత్రం బాగా ఆడుతోంది. ఆయన దర్శకత్వంలోనే బాలకృష్ణ నటించే చిత్రానికి ''టాప్ హీరో'' అని నామకరణం జరిగింది! జూన్ నుంచి ప్రారంభమయ్యే ఈ శ్రీచిత్ర క్రియేషన్స్ చిత్రంలో నాయికగా ఒక నవ నటిని పరిచయం చేయాలనుకుంటున్నారు. ఆచంట గోపీనాథ్ నిర్మాత.

## గౌతమి సొంత చిత్రం

గౌతమికి తమిళంలో చిత్రాలు లేవు. నాకు ఒకరు వేషాలివ్వక పోత

కొరవ 11 పేజీలో

## హింసాత్మక ప్రేమను ఫార్ములాగా మార్చిన కమర్షియల్ మసాలా

# బాజీగర్

### చిత్ర సమీక్ష

అల్లూరు రహీం

గత సంవత్సరం హిందీ చిత్రసీమలో బంపర్ హిట్టయ్యి యువ నటుడు షారూఖ్‌ఖాన్‌ను 'టాప్‌ఛేర్'పై కూర్చోబెట్టిన చిత్రమే బాజీగర్. దీనితో హీరో తన కుటుంబాన్ని సర్వనాశనం చేసిన వ్యక్తిపై పగ తీర్చుకోను అతని కుమార్తెలను ప్రేమ పేరుతో తన వుచ్చులోకి లాక్కుంటాడు. అనంతరం వారి హత్యకు పథకం రచించి ఒక హీరోయిన్‌ను అంతమొందిస్తాడు. మరొక హీరోయిన్‌ను కూడా ఇదే బాటలో హత్యచేయాలని తల పోస్తుండగా ప్రత్యర్థి పైఎత్తుకు చిత్తయ్యి ప్రా[illegible] విడుస్తాడు. క్షమార్హ గుణం ప్రేమ మయ హృదయానికి వుంటుందని ఇంతకు మునుపే పలువురు చెప్పేవున్నా, అటువంటి లక్షణం చిత్రంలో హీరోకి ఎక్కడా కనపడదు. కానీ హీరోయిన్ల ప్రేమలో నిజాయితీ వుంటుంది. తన అక్కతో పాటు తండ్రిని కూడా హీరో చంపేశాడని తెలిసినా అతన్ని చివరి సన్నివేశంలో కూడా అసహ్యించుకోదు హీరోయిన్. కానీ పగ, ప్రతీకారం, ద్వేషంతో నిండిన హీరో కనీసం ప్రాణాలు విడిచే సమయంలో నైనా తన ప్రక్కనే వున్న ప్రియురాలిపై చూపైనా నిలుపక తన తల్లి ఒడిలో ప్రాణాలు విడుస్తాడు. ప్రేమించిన ప్రియురాళ్లను తెలివిగా అంతమొందించడం , వీనుల విందైన పాటలు,సరిక్రొత్త హీరోయిన్ల అందచందాలు, హీరో అద్భుత నటన కలిగిన ఫార్ములాయే చిత్ర విజయానికి తోడ్పడింది.

విశ్వనాథ్‌శర్మ ( అనంత మహదేవన్) తన మిత్రుడు ఛోప్రా (డిసౌజా) ను నమ్మి అతనికి పవర్ పట్టా ఇచ్చి వేరే చోటకు వెళ్లి వచ్చే సరికి ఆస్తి మొత్తం చోప్రా చేజిక్కించుకుంటాడు. దానివల్ల భార్య బిడ్డలతో సహా వీధిన పడతాడు శర్మ. తన కుమార్తెకు వైద్యం చేయించలేక పోయానన్న బాధలో గుండె పోటుతో మరణిస్తాడు. ఈ సంఘటనలన్నీ చూసిన అజయ్ ( షారూఖ్‌ఖాన్) చిన్ని హృదయం రగిలిపోతుంది. అక్కడనుండే పగ, ప్రతీకారం, ద్వేషాలకు అంకురార్పణ జరుగుతుంది. కాలేజీలో చదువుతుండే చోప్రా పెద్ద

కొరవ 11 పేజీలో

**In the Court of 2nd Addl Subordinate Judge Vijayawasda**

S.C. 342 / 93

Between:

Munnangi Nagayya- Plaintiff
and chenna Reddy Brahmaiah, Defendant

The above said suit is psoted for 7-4-1994 for appearance of the defendants at 10.30 a.m.

The defendant chenna Reddy Brahmaiah is informed to appear before the Court on 7-4-94 at 10.30 a.m. and represent his case if any, on the said date, failing which the matter will be disposed off exparte.

K. ANNESWARA SASTRY
ADVOCATE FOR PLAINTIFF
GIRI STREET, S.N. PURAM,
VIJAYAWADA- 520 011.

**కావలి ప్రిన్సిపల్ డిస్ట్రిక్ట్ మున్సిఫ్ కోర్టులో**

OP No. 1/94

పిటీషనర్: జోతిబుజ్జమ్మ

Vs.

శ్రీభవానమ్మ

రెస్పాండెంట్: బల్లి చిట్టెమ్మ

**ప్రకటన**

ఇందుమూలముగా యావన్మందికి తెలియ చేయడమే మనగా పై నంబరున పిటీషనర్ తన భర్త అయిన శ్రీ జోతి రమణయ్య చనిపోయినందున, తాను అతనికి వారసురాలునని పెన్షన్ రాబట్టుకొనుటకు పిటీషన్ పెట్టియున్నామని సక్సెషన్ సర్టిఫికేట్ కొరకు దాఖలు చేసియున్నందున 21-4-94 తేది న వాయిదా వేయబడియున్నది. కనుక ఇందు విషయమై ఎవ్వరికైనను ఆక్షేపణలు వున్న యెడల ఆరోజు పగలు 10.30 గంటలకు పై కోర్టులో హాజరై తెలుపుకోవలెను. లేనియెడల ఎక్స్‌పార్టీగా తీర్మానించ బడును.

G. మాల్యాద్రి.
అడ్వకేట్, కావలి

## జనవాణి

(3 పేజీ కొరవ)

దొంగతనాల్లో నేర్పరితనం- గోవిందా గోవిందా లోనైతే తిరుపతి వెంకన్న కిరీటం దొంగతనం ప్రధాన ఇతివృత్తం. వర్మ తీసిన చిత్రాలు సమాజానికి ఏ మాత్రం వుపయోగ పడ్డాయో ఎవరూ చెప్పక పోయినా, వాటిలోని హింసను యధాతథంగా సెన్సార్ బోర్డు అనుమతించి చాలా తప్పు చేసింది. బోర్డుకు నియమ నిబంధనలు లేకపోవడం వల్లే వర్మ విమర్శలు చేయగలిగారు. సెన్సార్ అధికారులు తేలు కుట్టిన దొంగల్లా నోరు మూసుకున్నారు. ఈ మధ్య నటి రోజా నిర్మించిన సమరం చిత్రంలో సన్నివేశాలు మరీ అతిగా వున్నా సెన్సార్ వారు అనుమతించారు. రిలీజ్ అవుతున్న పలు సినిమాల్లో పాటలు మాటల గూర్చి చెప్పలేము. అదే మంచి ప్రజలు చూస్తున్నారని స్టేట్‌మెంట్లు. సరైన విధానాల రూపకల్పన జరుగనంత వరకు ఈ విశృంఖల ధోరణిని అడ్డుకునే వారే లేరు. ప్రభుత్వం ఈ విషయమై ఎందుకు మౌనంగా వుందో అర్థం కావడం లేదు.

-ఎం. నరసింహారావు
సికింద్రాబాద్

### పలుకని బుచ్చి టెలిఫోన్లు

బుచ్చిరెడ్డిపాళెంలోని ఫోన్లు సకాలంలో పని చేయక వినియోగదారులను తరచూ ఇబ్బంది పెడుతున్నాయి. ఏదైనా ముఖ్యమైన పనిపడి నెల్లూరుకు ఫోన్ చేయాల్సి వచ్చినప్పుడు రింగ్ చేసి చేసి వేళ్ళు నొప్పెట్టడం మినహా నెంబరు దొరికి చావదు. స్థానిక అధికార్లకు ఎన్నిసార్లు చెప్పినా ఫలితమే లేదు. అలంకారానికి తప్ప బుచ్చి ఫోన్లు ఎందుకూ పనికి రావడం లేదు.

బుచ్చిరెడ్డిపాళెం -ఐ. రామకృష్ణ

### బస్ షెల్టర్ కావాలి

నిప్పో సెంటర్ ఇటీవల కాలంలో బాగా అభివృద్ధి చెందింది. నిత్యం వందలాది మంది ఇక్కడి నుండి టౌన్‌లోనికి రావడం పోవడం జరుగుతూంది. కాని ఇక్కడ ప్రజలు టౌన్‌బస్సులు, ఆటోల కోసం వేచి వుండను బస్ షెల్టర్ లేదు. ఎండైనా, వానైనా ప్రజలు పడిగాపులు కాస్తూ నిలబడి వుండవల్సిందే. ఆర్టీసిలేదా టౌన్‌లోని ఏ స్వచ్ఛంద సంస్థలేదా, నిప్పో ఇక్కడ ఒక బస్ షెల్టర్ కట్టించి పుణ్యం కట్టుకోవాలని మనవి.

నెల్లూరు -డి. సుబ్బారావు

### బానిసత్వానికి చేరువలో వ్యవసాయ రంగం

రైతు సమస్యల పరిష్కారం పట్ల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నిర్లక్ష్యంగా, నిర్బాధ్యతతో వ్యవహరించడం దురదృష్టకరం. ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి పండించిన ధాన్యానికి గిట్టుబాటు ధర లేనే లేదు. బానిసత్వానికి చేరువగా వ్యవసాయ రంగం నిలువబోతూంది. ఫుడ్ కార్పొరేషన్ ధాన్యం కొనుగోలు కేంద్రాల్లో లెక్కకు మించిన నియమ నిబంధనలను అధికారులు విధిస్తున్నారు. జిల్లాలో ఎఫ్‌సిఐ గోడౌన్లు ఇంత వరకు నిర్మించక పోవడం దారుణం. పశ్చిమ గోదావరి జిల్లా నుంచి దిగుమతి చేసుకొన్న బియ్యాన్ని గోడౌన్లలో నింపేముందు అధికారులు జిల్లాలోని పంట విషయమై ఆలోచించి వుంటే రైతుకు ఇప్పుడున్న సమస్యలకు తోడుగా కొత్త సమస్య వచ్చేది కాదు. అధికారులు ప్రతి విషయం పై సమగ్ర అవగాహన చేసుకొని, నిర్ణయాలు తీసుకునే ముందు రైతు సంఘాల నాయకులతో కూడా సంప్రదించాలి.

నెల్లూరు -ఆచార్య పిసి రెడ్డి

### రామకృష్ణుల పై చర్చ అనవసరం

గత మాసం రోజులుగా శ్రీకృష్ణుడు పురాణ పురుషుడా, ప్రబంధ పురుషుడా అనే అంశం పై జమీన్‌రైతులో రసవత్తర చర్చ జరిగింది. వాల్మీకి సృష్టించిన ధర్మమూర్తి శ్రీరామచంద్రుడు; అదే విధంగా వేదవ్యాసుడు సృష్టించిన దౌత్యవేత్త శ్రీకృష్ణుడు. రామాయణం, భారతాల కథలు నిజాలో, అబద్ధాలో చర్చ ప్రస్తుతం అనవసరం. వీటిలో మంచి మాత్రం తీసుకొని మిగతాది వదిలేద్దాం.

గూడూరు -అవుల కొండయ్య

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

#### రేషనింగ్

నెల్లూరు టవున్‌లో రేషనింగ్ ఏప్రెలు 15 తేది నుండి ప్రారంభం కావచ్చునని యిదివరకు వ్రాశాము. కాని ఆ తేదికి ప్రారంభమయ్యేట్లు కనిపించలేదు. మరొకవారం పట్టవచ్చు. ఏది ఎట్లున్నా మేనెల 1 తేది నుంచైనా తప్పదు.

రేషనింగు ఆఫీసు ముంగమూరు వారి వీధిలో వకీలు ముంగమూరు వెంకట సుబ్బారావుగారి ఇంటికి పడమర ప్రక్క యింట్లో ప్రస్తుతం పెట్టారు-

17-3-44 పత్రికలో బియ్యం రేషను మనిషి1 కి దినానికి అర్ధసేరు నవటాకు అని ప్రకటించాము. అది పొరపాటు. అర్ధశేరు శెటాకు మాత్రమే.-

స్వంతంగా పండించుకునేవాళ్లు ఎన్ని ధాన్యమైనా వుంచుకోవచ్చును. వ్యక్తులు నెల్లూళ్లో వుండి భూములు వెలుపల వున్న సందర్భంలో పర్మిషను మీద 1 సం. గ్రాసం తీసుకోవచ్చునని వ్రాశాము. కాని ఆ ధాన్యంలో నుంచి గూడా రేషను కార్డు లెక్క ప్రకారం వాడుకొని కొర్వధాన్యానికి లెక్క యివ్వవలసిందే కాని, ఎక్కువ ధాన్యం స్వంతానికి వాడుకోవడానికి వీలు లేదు.

కష్టపడి పనిజేసేవారికి యీ రేషను చాలదనే ప్రశ్నపై విచారిస్తే అట్టివారికి అవసరమైనచో రేషను హెచ్చిస్తారట.

ఇండ్లలో పనిజేసే యానాది మొదలగు సౌకర్లకు గూడా యజమానులు ఉండిబెట్టడానికి వీలులేదు. యజమాని యింటివద్ద భోంచేసి, అక్కడే పడుకొనే వారికి మాత్రమే ఆ యింట్లో రేషను వుంటుంది. కాపురం వేరే వుండి యజమాని యింట్లో పనిజేసే వారికి కాపురమున్న చోటకే రేషను కార్డు వుంటుంది. కావున బ్రాహ్మణ యిండ్లలో పనిజేసే యానాదులకు యికా పస్తే, యజమాని దబ్బివ్వాలి. పనివాళ్లు తమ రేషను కార్డు ప్రకారం కొనుక్కోవాలె- అంతేగాని మార్గాంతరం లేదు. పల్లెలనుండి బళ్ళులతో నెల్లూరుకు వైద్యం వగయిరాల నిమిత్తం వచ్చేవారి విషయం- అట్టివారు కోరితే తమ గ్రామాన్నుండి బియ్యం తెచ్చుకోవడానికి పర్మిషను దొరుకుతుంది. కాని ఆ తెచ్చుకున్న బియ్యం కూడా ఈ రేషను కార్డు ప్రకారమే ఖర్చుబెట్టాలె గాని హెచ్చు ఖర్చు సేయరాదు.

ఇంకేమైనా అనుమానాలుంటే అడుగండి'' వినయత్వంగా తీర్చుతాం''.

#### అవీ- ఇవీ

గొప్ప నాగస్వరం విద్వాంసుడు: నెల్లూరు మూలపేట వేణుగోపాలస్వామి తిరునాళ్లకు కుంభకోణం నుండి కె. రానుయ్యపిళ్లెగారు తన పార్టీతో వస్తున్నారు. రు500లు కట్నం వుంటుంది. ఏప్రెలు 8,9,10 తేదులు. సంగీత పిపాసులంతా దయచేయండి- దీనిమీద మా అభిప్రాయమేమింటంటె మాంచి తెలివిగల్ల కుర్రాళ్ని యేరి స్కాలర్‌షిప్ ఫండ్సు యిచ్చి యీలాంటి గొప్ప విద్వాంసులని తయారుచేయించమని వేణుగోపాల ట్రస్టీలను, గండవరం ట్రస్టీలను, బుచ్చి ట్రస్టీలను కోరుతున్నాం.

-విమర్శకుడు.

#### నాటకాల పురాణం

##### 'కోకిల'

ఇది చైత్రమాసం కాబట్టి ''కోకిల'' అంటుండగానే 'కుహూకుహూ' ధ్వనులు జేసే కోకిల అనుకుంటారేమో కొంపదీసి; అది గాదు సుమండి. ఇది నాటకం; అంటె డ్రామా అన్నమాట-

ఒకనాడు కోకిల అని ప్రకటించి రాత్రి 10 గం.కు చింతామణిగా మారింది. మరొక వాయిదాకు అసలే నిలిచిపోయింది. ఇది మూడో మహూర్తం. ఈనాడు గూడ దాసరి కోటిరత్నం, గండికోట జోగినాథం గారలు ఎగగొట్టారు. ఎవరి తప్పో మాకెందుకు. లెండి!30 తేది రాత్రి నాటకం11-30 గం.లకు సరిగ్గా ప్రారంభమైంది. బైటవాకిట్లో రిజర్వుడు 35 అని వ్రాసి వుంది. లోపలబోతె 120 కి తగ్గదు. ఓహో; యిది హెల్తువారి కంట్లో దుమ్ముకొట్టె ఔషధం కాబోలు అనుకున్నాను. ఓ హెల్తు దేవతా! రు.5-0-0 లు, 3-8-0ల రకమంతా గాలిలేని ఆ నరక కూపంలో చావవలసిందేనా? నీ ధర్మాన మూత్రవిసర్జన ప్రదేశంలో లైటు, సున్నంగొట్టడం జరిగినందుకు వందనాలు.

-చిత్రగుప్తుడు

## చిత్రసమీక్ష

(9 పేజీ కొరవ)

సమార్త్ర సీమా (శిల్పాశెట్టి) తో ప్రేమ గ్రంధం నడిపి పెళ్లివరకు తీసుకొస్తారు. ప్రేమ పిచ్చిలో మునిగిన సీమ చేత ఆత్మహత్య చేసు కుంటున్నానని పుత్తరం రాయిస్తారు. తాళి కడతానని హోటల్‌కు తీసుకెళ్లి పై అంతస్తునుండి క్రిందకు త్రోసి వేసి రాక్షసానందంతో తిరిగి వస్తారు

చేప్రా, అతని చిన్న కూతురు ప్రియా(కాజల్)కు విక్రమ్ మల్హోత్ర పేరుతో కారు రేసులో పరిచయమవుతాడు అజయ్. ప్రియా మనసు కూడా దోచి ముహూర్తాల వరకు వెళతాడు. చేప్రా తన కాబోయే అల్లుడని నమ్మి ధారాదత్తం చేసిన పవర్ పట్టాతో తన కుటుంబానికి అన్యాయం జరిగిన రీతిలోనే బుద్ధిచెబుతాడు. అజయ్ ప్రదర్శించే వింత చేష్టలతో అతడ్ని అనుమానించి వెంటాడిన ప్రియ అతనే తన అక్కను, ఆమె ఫ్రెండ్స్‌ను చంపిన హంతకుడని చివరన తెలుసుకుని కుమిలి పోతుంది. తన పంతం పూర్తిచేసుకునే ప్రయత్నంలో చేప్రాను అంతమొందించి తను ప్రాణాలు కోల్పోతాడు అజయ్.

చిత్రంలో షారూఖ్ ఖాన్ తన తొలి ప్రియురాలు శిల్పాశెట్టిని హోటల్‌పై నుండి త్రోసివేసే సన్నివేశం చూసిన ప్రేక్షకులు ఆఆ క్యారెక్టర్‌ను అసహ్యించు కుంటారు. ఫైట్స్‌లో గాజుపెంకులు ముఖాలకు గుచ్చుకున్న సన్నివేశాలు, పాటల్లో ప్రకృతి అందాలను చక్కగా చూపిన థామస్ కెమెరా- హోటల్‌పై నుండి హీరోయిన్‌ను త్రోసిన సన్నివేశంలో ఎందువల్లో ఆమె వంటికి కట్టిన తీగ కనపడేలా చేసింది. అల్కాయాగ్నిక్ ఆలపించిన 'బతామేరే చహేరేపర్ క్యాక్యా లిఖాహయ్' పాటతో పాటు పలుచోట్ల తొలిసారే అయినా చక్కని నటన ప్రదర్శించింది శిల్పాశెట్టి. ఛామన ఛాయలో పాలుబికే పసిబుగ్గలతో ఆకట్టుకునే చూపులతో ఒకప్పటి మేటి నటి తనూజ కూతురు కాజల్ తన పాత్రను చక్కగా పోషించిందనే చెప్పాలి. ఈమె అక్కడక్కడా హద్దుమీరి వంటి వంపులుఎక్స్‌పోజ్ చేసింది కూడా. 'బాజీగరో... బాజీగర్' టైటిల్ సాంగ్‌లో ముచ్చటేసేలా కనపడుతుంది కాజల్. హృదయంలో అగ్నిపర్వతాలు పేలుతున్నా పైకి కనబడనీయక ఒకవైపు ప్రేమికునిగా, మరోవైపు పగతో నిండిన ద్వేషిగా షారూఖ్ ఖాన్ రెండు పాత్రల్లో జీవించాడు. చివరి సన్నివేశంలోనైతే తల్లి ఒడిలో ప్రాణాలు విడుస్తూ ప్రేక్షకుల కంట కన్నీరొలికించాడు. అతని తల్లిగా రాఖీ చక్కని నటన ప్రదర్శించింది. 'ఏ కాలికాలి ఆంఖే' తో పాటు మిగతా పాటలకు చక్కని సంగీతమిచ్చి చిత్రానికి ప్రాణం పోశారు సంగీత దర్శకుడు అన్నూమల్లిక్. రాబిన్ భట్ రచనలో ప్రేమతో కామెడీ కూడా చక్కగా పండింది. సరోజ్-రాజుఖాన్ నృత్యాలు క్లాసికల్‌గా వున్నాయి చిత్రంలో ప్రతి ఒక్కరిచేత ప్రతిభావంతంగా పనిచేయించడంలో దర్శక ద్వయం అబ్బాస్- మస్తాన్ విజయం సాధించారు.

## నెల్లూరు సంగతులు

(4 పేజీ కొరవ)

వ్యవహరించడంతో పాటు, హామర్ త్రోలో మొదటి స్థానం డిస్క్ త్రోలో మూడవ స్థానం పొందారు. ఆర్.ఎస్.ఐ వి. వెంకటేశ్వర్లు హై జంప్‌లో ప్రతిభ చూపితే, అంతర్జాతీయ క్రీడాకారుడైన కానిస్టేబిల్ బసవయ్య పరుగు పందాలన్నింటిలో తనకు తిరుగు లేదనిపించాడు. మహిళా కానిస్టేబిళ్లు సంపూర్ణ, పుష్పవతి, వున్నిసా, సుజాత, షఫియా బేగం, పలుబహుమతులు పొందారు. టీమ్‌కు షేక్ సమీవుల్లా కెప్టెన్‌గా వ్యవహరించినట్లు వెటరన్ అథ్లెటిక్స్ అసోసియేషన్ కార్యదర్శి ఎన్. మోహన్ రెడ్డి తెలుపుతున్నారు.

### బ్రిడ్జి పోరాట శిబిరంలో చలివేంద్ర

విజయమహల్ గేటు వద్ద బాక్స్ టైపు బ్రిడ్జి నిర్మాణానికి ధర్నా చేసిన శిబిరంలో ఒక చలివేంద్రను 29 తేది మాజీ కౌన్సిలర్ వున్నం బసవయ్య ప్రారంభించారు. ధర్నా జరిగిన 28 రోజుల్లో గేటు వేసి వుండే సమయంలో ప్రజలు శిబిరంలోకి వచ్చి మంచినీళ్లు తాగివెళ్లే వారట. అందువల్ల అక్కడ మంచి నీటి ఆవశ్యకతను గుర్తించి చలివేంద్రను సిపిఎం, డివైఎఫ్‌ఐలు సంయుక్తంగా ఏర్పాటు చేశాయి.

### ఫిర్యాదు చేయండి

తెలుగు గంగ, సోమశిల ప్రాజెక్టు పరిధిలోని ముంపు గ్రామాల ప్రజల నుండి వుద్యోగులు ముడుపులు స్వీకరించి బిల్లులు మంజూరు చేస్తున్నారన్న వార్తకు స్పెషల్ కలెక్టర్ ఉమా మల్లేశ్వర్ రావు స్పందించారు. బాధితులు, రైతులు ఏదైనా ఇబ్బందులకు గురైతే తక్షణం తనకు ఫిర్యాదు చేయమని కోరుతున్నారాయన.

# అసెంబ్లీ బుద్ధిమంతుడు అవార్డు

సర్వేపల్లి ఎమ్మెల్యే, ప్రభుత్వ విప్ శ్రీ సి.వి. శేషారెడ్డి క్రమం తప్పకుండా శాసన సభ సమావేశాలకు హాజరై "మంచి బాలుడి" బహుమతి కొట్టేశారు. ఎమ్మెల్యేల క్రీడలు, సాంస్కృతిక కార్యక్రమాల పోటీ సందర్భంగా నగరంలోని రవీంద్రభారతిలో సోమవారం జరిగిన సభలో శేషారెడ్డి ఈ బహుమతిని అందుకున్నారు. శాసన సభ సమావేశాలంటేనే ఎమ్మెల్యేలకు మొహం మొత్తిన ఈరోజుల్లో రెగ్యులర్‌గా సమావేశాలకు హాజరు కావడం మంటే చిన్న పనికాదు. సమావేశం మొదలైన దగ్గరనుంచి రణగొణ ధ్వనులు,



ముష్టాముష్టి బాహా బాహీ సిన్న మధ్య ఓపిగ్గా అసెంబ్లీలో కూర్చోవడమంటే నిజంగా రికార్డే.

గతంలో శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కూడా విధిగా సమావేశాలకు హాజరయ్యేవాడే కానీ మధ్యలో లేచి ఇంటికి వెళ్లిపోయేవారు. శేషారెడ్డి అలాగాక ఉదయం మొదలుకొని సాయంత్రం దాకా అసెంబ్లీ చూరు పట్టుకొని వేళ్లాడు తుంటాడు. శేషారెడ్డితోపాటు వంగవీటి చలపతిరావు (కాంగ్రెస్), అశోక్ గజపతిరాజు (తె.దే), విఠల్ రెడ్డి (సిపిఐ) కూడా మంచి ఎమ్మెల్యేల బహుమతులు అందుకున్నారు.

# కోట్లతో వుండే వారి పేర్లు నాలుగు చెప్పండి!

## - రాష్ట్ర మంత్రులకు పివి ప్రశ్న

వ్యతిరేకించడం లేదా? వారిని కలుపుక రాకుండా సమస్యను జటిలం చేయడం వల్ల వచ్చే ఎన్నికల్లో మనం గెలవ గలమా? అంటూ పి.వి. కోపంలో అన్నారట. దీన్నిబట్టి పి.వి. అంతర్యాన్ని కోట్ల వ్యతిరేకులు రకరకాలుగా వ్యాఖ్యానిస్తున్నారు. అయితే కోట్ల మద్దతుదారులు మాత్రం ప్రస్తుతానికి ఢోకా లేదని ఎమ్మెల్యేలకు నచ్చచెప్పుకునే కార్యక్రమంలో వున్నారు. కోట్ల వారు ఢిల్లీ నుంచి వచ్చాక ఎమ్మెల్యేలతో సాన్నిహిత్యం

### మూలవిరాట్

( మొదటి పేజీ కొరవ)

పెంచుకోవడానికి విఫలయత్నం చేస్తున్నారు. కాంగ్రెస్‌లో ఏమి జరుగుతున్నదన్నది మిలియన్ డాలర్ ప్రశ్నగా తయారైంది. ఏది ఏమైనా మరో వారం పది రోజుల్లో అధిష్టానం దేవుడు తన నోరు విప్పుతాడని అందరూ ఎదురు చూస్తున్నారు. అధిష్టానం దేవుడి మనసులో వున్న గుట్టు రట్టయితే గానీ అసలు విషయం బయటపడదు. అప్పటిదాకా ఈ సస్పెన్స్ 'ప్రతిష్టంభన' ఊగిసలాట కొనసాగుతూనే వుంటాయి.

## సినిమా

(9 పేజీ కొరవ)

నేనే తమిళంలో సొంత చిత్రం [illegible] అనుకుంది కామోసు. బాలు మహేంద్ర చెప్పిన కథ ఒకటి ఆమెకు నచ్చింది. ఆయన దర్శకత్వంలో వెంటనే చిత్ర నిర్మాణానికి పూనుకుంది.

### అర్జున్ సొంత చిత్రం

అర్జున్ స్వీయ దర్శకత్వంలో "జై హింద్" అనే చిత్రాన్ని నిర్మిస్తున్నాడు. ఇందులో చివరి సన్నివేశంలో ఒక దేశభక్తి గీతం ఉంది. ఆ చిత్రీకరణలో పేరు మోసిన తెలుగు, తమిళ హీరోలను గెస్టులుగా నటింప చేయడానికి అర్జున్ తాపత్రయ పడుతున్నాడు.

### ఎస్. గోపాలరెడ్డి చిత్రం

దాదాపు 15విజయవంతమైన చిత్రాలను నిర్మించి, అశేష అభిమానులను సంపాదించిన నెల్లూరీయుడు, భార్గవ్ ఆర్ట్స్ అధినేత ఎస్.గోపాలరెడ్డి స్టార్ ప్రొడ్యూసర్. ఈయన కోడి రామకృష్ణ దర్శకత్వంలో "తెలుగు గంగ" అనే చిత్రాన్ని నిర్మించదలచి, ఒక పాటను కూడా రికార్డ్ చేశారు ప్రారంభోత్సవం నాడు 50లక్షల రూపాయలతో అవుతుందనుకున్న ఆ చిత్రం బడ్జెట్ షూటింగ్ ముగిసేసరికి కోటి రూపాయలదాకా పెరగ వచ్చని తేలింది. దాంతో ఆయన ఆ ప్రాజెక్టును ప్రక్కన పెట్టి, నెల్లూరు జిల్లాలో 'ఆక్వా ఫామ్' ప్రారంభిస్తున్నారు.

ఈలోగా ఆయన సంక్రాంతికి తమిళనాడులో విడుదలై విరవిహారం చేస్తున్న కమలహాసన్ చిత్రం "మహానది"ని అదే పేరున తెలుగులోకి డబ్ చేయనారంభించారు.

## గూడూరు సబార్డినేట్ కోర్టులో

E.P. 17/92 :: O.S. 98/87

గిద్దలూరు రామచంద్రా రెడ్డి - DHr

Vs

నందవరం కాంతమ్మ - JDr

పై నంబరు E.P. లోని డిక్రీ బాకీని రాబట్టుకొను నిమిత్తం J.Dr తాలూకు సిరాస్తిని 18.4.94 తేదిన పగలు 10 గంటకు పై కోర్టులో బహిరంగముగా వేలం వేయబడును.

### షెడ్యూలు

నెల్లూరు జిల్లా రిజిష్ట్రేషను, గూడూరు స.రి.లో చేరిన చిల్లకూరు మండలం, చిల్లకూరు గ్రామంలో J.Dr కు హక్కు అనుభవం గల స్థిరాస్తి వివరం:

| స. నం | పట్టా నం | సర్వే నం | విస్తీర్ణం | అనుభవ విస్తీర్ణం | దాపత్తు | హెక్టార్లు | DHr Value | Amine Value |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 239 | 89 | య2.13 సెం. | య1.63సెం. | మాగాణి | .065 | 8000/- | 11,410 |

యిందుకు హద్దులు: తూర్పు: యద్దల క్రిష్ణమ్మ కొంత వరకు, కరణం మాన్యం; దక్షిణం: పంట కాలువ; పడమర: యదనపర్తి ఆదినారాయణ రెడ్డి; ఉత్తరం: మేనకూరు పెంటారెడ్డి

| స. నం | పట్టా నం | సర్వే నం | విస్తీర్ణం | అనుభవ విస్తీర్ణం | దాపత్తు | హెక్టార్లు | DHr Value | Amine Value |
|---|---|---|---|---|---|---|---|---|
| 2 | 368 | 99B1 | య0.37 సెం. | య0.37సెం. | మాగాణి | .015 | 2000/- | 2,960/- |
| 3 | 368 | 99D | య0.41 సెం. | య0.41 సెం. | మాగాణి | .016 | 2000/- | 2,460/- |
| 4 | 219 | 99E | య0.31 సెం. | య0.31 సెం. | మాగాణి | .012 | 2000/- | 1,860/- |
| 5. | 368 | 99/F1 | య0.24 సెం. | య0.24 సెం. | మాగాణి | .010 | 2000/- | 1,440/- |
| 6 | 74 | 180.1A | య0.49 సెం. | య0.49 సెం. | మాగాణి | .020 | 4000/- | 2,940/- |

N.B.(1) గూడూరు అగ్రికల్చరల్ డెవలప్‌మెంట్ బ్యాంకు వారికి 25.3.79 తేదిన రూ. 8000/- లకు అడుమానం.

(2) 25.3.79 తేదిన గూడూరు అగ్రికల్చరల్ డెవలప్‌మెంట్ బ్యాంకు వారికి రూ. 1500/- లకు అడుమానం.

(3) చిల్లకూరు M.P.C.C. వారికి 24.5.76 తేదిన రూ. 600/- లకు అడుమానం బాకీలకు లోబడి యాలం వేయబడును.

C.V. Subba Reddy, Advocate for the D.H.R




# PINAKINI
## SHEEP FARMS PVT. LTD.,

16/792, SANKARA AGRAHARAM, NELLORE.
PHONE : 28939

- భారతదేశం లోనే మొట్టమొదటిసారిగా.
- 3000/- వేల పెట్టుబడి -30,000 వేలరాబడి.
- అతి తక్కువ పెట్టుబడి- అత్యధిక రాబడి.
- ప్రతి సంవత్సరం ఆదాయం అందుకునే పథకం.
- 10 సంవత్సరముల అతి తక్కువ కాలం.
- యూనిట్‌కు పూర్తి సంరక్షణ, భద్రత.
- యూనిట్‌కు పూర్తి భీమా భద్రత.
- అత్యంత ఆధునిక సాంకేతిక పర్యవేక్షణ.
- ఎప్పుడైనా మా పెట్టుబడి తిరిగి పొందే సదుపాయం.

OUR GROWTH IS
NATION'S GROWTH.
OUR WEALTH IS
NATION'S WEALTH.

మేనేజింగ్ డైరెక్టర్,
చీదెళ్ల వెంకటేశ్వర్లు.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,